# రాసమణి కొడుకు

మూలం :

రవీంద్రనాధ్ టాగూర్

అనువాదం

కె. రమేశ్

పబ్లిషర్సు

శ్రీ రామకృష్ణా అండ్ కో, విజయవాడ-1.

# రాసమణి కొడుకు

రాసమణి కాలీచరణుని తల్లి. కానీ, పరిస్థితులవల్ల ఆమె తండ్రిస్థానాన్ని వహించాల్సి వచ్చింది. కారణం ఏమంటే, 'తల్లే' తల్లిదండ్రుల బాధ్యతల్ని చూస్తున్నప్పుడు పిల్లవాని క్షేమానికి అంతే సదుపాయం వుండదు. రాసమణి భర్త భవానీచరణుడు పిల్లవానిమీద ఏమాత్రం అధికారం చలాయించలేక పోయేవాడు.

'పిల్లవానిని మరీయింత గారాబంచేయటానికి కారణ మేమి'టని ఎవరైనా ప్రశ్నించినప్పుడు భవానీచరణుడు చెప్పే జవాబును అర్థంచేసుకోవాలంటే పూర్వాపుచరిత్రనుకొద్దిగా తెలుసుకోనటం అవసరమవుతుంది.

ఇంతకూ అసలు విషయమేమంటే—పాన్‌వాడీలోని ప్రసిద్ధ ఉన్నత ధనిక కుటుంబంలో జన్మించాడు, భవానీ చరణుడు. భవానీచరణుని తండ్రి అభయాచరణుని ప్రథమ కళత్ర సంతానం శ్యామాచరణుడు. బాగా వయస్సు ముదిరినతరువాత భార్యావియోగంకలిగి, అభయాచరణుడు ద్వితీయ వివాహం చేసుకున్నప్పుడు అతని మామగారు ఆలందీ తాలూకాను తనకుమార్తెపేర వ్రాయించుకున్నాడు. ఆయన అల్లుడిగారి వయస్సు అంచనా వేసుకుని, ఒకవేళ కుమార్తెకు వైధవ్యం ప్రాప్తిస్తే కనీసం తిండి గుడ్డలకు సవతి పుత్రుల అధీనంలో వుండాల్సినఅవసరంవుండదని మనస్సులో యోచించుకున్నాడు.

వధువుతండ్రి యోచించినదానిలో మొదటి సగం జరగటానికి కాస్టేకాలం పట్టలేదు. వారి మనుమడు భవానీ చరణుడు జన్మించిన కొద్దిరోజులకే అల్లుడుగారు దేహయాత్ర చాలించారు. వారికుమార్తె తనకు సంక్రమించిన సంపదకు అధికారిణి అయింది, మరి ఆయనకూడా అంతా కళ్ళారా చూసుకుని నిశ్చింతగా పరలోకప్రాప్తి పొందారు.

అప్పటికి శ్యామాచరణునికికూడా వయసొచ్చింది. అతని పెద్ద కుమారుడు భవానీచరణునికంటే ఒక సంవత్సరం పెద్ద. శ్యామాచరణుడు తన కుమారునితోపాటే భవానీ చరణుడి పోషణకూడా చూడసాగాడు. భవానీచరణుని తల్లి ఆస్తిలోనుంచి అతడు ఎన్నడూ ఒక్కచిల్లికానీకూడా తీసుకోలేదు పైగా ప్రతిసంవత్సరం ఎప్పటికప్పుడు లెక్కలు చూపి వప్పగించి సవతితల్లినుంచి రసీదులు తీసుకుంటూ వుండేవాడు. ఇదంతా చూసి, అతడి నిజాయితీకీ, నమ్మకానికీ అందరూ ముగ్ధులవుతూండేవారు

ఇంత నిజాయితీ అనవసరమనీ, పైగా దీనిని తెలివి తక్కువతనం అనటమే ఉచితంగా వుంటుందనీ వాస్తవానికి దాదాపు అందరూ ఆలోచించేవారు. అఖండమైన పితృ సంపదలోని ఒకభాగం ఒక స్త్రీ చేతుల్లో పడటంఅంటే గ్రామస్థుల కేమాత్రం నచ్చలేదు. శ్యామాచరణుడు, ఏదో విధంగా జబ్బ చరచి, ఆ దస్తావేజును నాశనంచేసివేస్తే ఇరుగు పొరుగు జనమంతా అతణ్ని కీర్తించివుండేవారు. మరి ఆ విషయంలో సలహాలిచ్చే బుద్ధిమంతులకు లోటుకూడా

లేదు. కానీ, తమ ప్రాచీనకాలపు కుటుంబఅధికారం చీలి పోతున్నాకూడా శ్యామాచరణుడు తన సవతితల్లి ఆస్తిని చెక్కు చెదరకుండా సురక్షితంగా కాపాడాడు.

దానివల్లనూ, స్వభావసిద్ధమైన తన స్నిగ్ధభావంవల్లా, సవతితల్లి వ్రజసుందరి శ్యామాచరుడ్ని తనకుమారునిగానే భావించేది, విశ్వసించేది. పోతే, శ్యామాచరణుడు ఆమెఆస్తిని ముట్టుకోగూడదనీ, అది తనదికాదనే భావంతో నడచుకోవడం ఆమెకు అప్పుడప్పుడు కోపంకూడా కల్గించేది. 'నాయనా! ఈఆస్తిని నేను చనిపోయినప్పుడు నాతో మూటకట్టుకు తీసుకుపోయేది లేదు. ఇదంతా మీదే, మీదిగానే వుంటుంది; నాకు లెక్కచెప్పాల్సిన అవసర మేమొచ్చింది?' అని వ్రజసుందరి తరచు అంటూవుండేది. కానీ, శ్యామాచరణుడు ఆమెమాటయందు ధ్యానముంచేవాడు కాదు

శ్యామాచరణుడు తనకుమారులయెడ గట్టిగానే వ్యవహరించేవాడు. బాగా కట్టుదిట్టాల్లోనే వుంచేవాడు, భవానీచరణుడ్నిమాత్రం ఏమీ అనేవాడు కాదు. అందుకనే చూచేవాళ్ళందరూ 'తనసంతానముందుకంటే భవానీయందే ఎక్కువప్రేమ' అంటూవుండేవారు. దానివల్లకల్గిన పరిణామమేమంటే భవానీచరణునికి చదువుసంధ్యలేమీ అబ్బలేదు. ఇహా, ఆస్తిసంరక్షణవిషయంలోకూడా, ఎప్పుడూ, పసివాడుగానే వుండి, అన్నగారిమీద ఆధారపడే జీవితాన్ని గడుపుకుంటున్నాడు. ఆస్తినిగురించి ఎప్పుడూ ఎటువంటివిచారమూ వుండేదేగాదు. మధ్యమధ్య ఎప్పుడైనా సంతకాలు వస్తే

రాలుమాత్రం కావలిస్తే, ఒకసంతకంపారేసి తనపని ముగించు కునేవాడు. సంతకం ఎందుకుచేయాలా అనేవిషయం తెలుసు కోటానికికూడా అత డెన్నడూ ప్రయత్నించలేదు. కారణం ఏమంటే, ఒకవేళ ప్రయత్నించినా, అందులో కృతకృత్యు డవటమనేది అతడి శక్తికిమించినపని.

ఇహ పోతే, శ్యామాచరణుని పెద్దకొడుకు తారాప దుడు తండ్రికి ఆసరాగావుంటూ పనులన్నీ నేర్చుకుని ప్రవీణు డయ్యాడు. శ్యామాచరణుడు పరలోకగతుడైన అనంతరం తారాపదుడు భవానీచరణునితో 'పెదనాన్నా! ఇకపై మీరూ మేమూ కలిసివుండటమనేది సరిపడదు. ఏదో విష యంలో ఎప్పుడైనా తగాదా రావచ్చు. దానివల్ల కుటుంబ వినాశమే కల్గుతుంది. ఏమో ఏమిచెప్పగలం? కనుక వేరుగా వుండటమే మంచిది' అని చెప్పాడు.

వేరుగావుండి తాను స్వయంగా తనఆస్తిని సంరక్షిం చుకోవాల్సివుంటుందనేవిషయం భవానీచరణుడు ఎప్పుడూ కలలోకూడా వూహించలేదు. తాను చిన్నతనంనుంచి పెరిగి పెద్దవాడైన ఆ గృహాన్ని అఖండంగానే భావించేవాడు. అందులో ఎక్కడో ఒకచీలిక వుందనిగానీ, అక్కడికి దానిని రెండుముక్కలుగా చేయవచ్చుననే ఈ క్రొత్త ప్రసంగాన్ని విని అతడు చాలా వ్యాకులపడ్డాడు.

తన వంశగౌరవానికి భంగమనికానీ, ఆత్మీయ స్వజ నుల మనోవేదనకానీ తారాపదునిలో లేశమైనా మార్పును కల్గించలేకపోయాయి. అప్పుడిహ వేరే గత్యంతరంలేక

భవానీచరణుడుకూడా ఆస్తి పంపకం విషయమైన అసాధ్య విచారంలో చిక్కుకున్నాడు. ఆతడి విచారాన్ని చూచి తారాపదునికి చాలా ఆశ్చర్యం కల్గింది. 'పెదనాన్నగారూ! మీ రింతగా విచారించటంఎందుకు? పంపకం అనేది ఎప్పుడో జరిగిపోయింది. తాతగారు బ్రతికివున్నప్పుడే అంతా నిర్ణయించేశారు' అన్నాడు తారాపదుడు.

'అదావిషయం! నాకు అవేమీ తెలియనే తెలియవు' అన్నాడు హతబుద్ధియై భవానీచరణుడు.

'ఆశ్చర్యమే నే! తెలియకపోతేమాత్ర మేమిటే? అందరికీ తెలిసిన విషయమే. ఆలందీ తాలూకాను మీవాటాకు గానుఁవ్రాసి తాతగారు మిమ్మల్ని వేరుచేసే గతించిపోయారు. తరువాత పేచీలేవీ రాకుండా వుండాలనే అలా చేశారు. అప్పటినుంచీ ఆవిధంగానే జరుగుతూ వస్తుంది' అన్నాడు తారాపదుడు.

అంతా కావచ్చు ననుకున్నాడు భవానీచరణుడు, 'మరి ఈ యిల్లో?' అని అడిగాడు.

'మీరు కావాలంటే ఈయింట్లో మీరేవుండవచ్చు. పట్టణంలోవున్న ఆకొంప మాకొస్తే ఏదోవిధంగా అందులోనే మేము కాలక్షేపం చేస్తాం' అన్నాడు తారాపదుడు.

తారాపదుడు ఇంత తేలిగ్గా తన పూర్వీకుల కొంప గోడీ విడిచి పెట్టటానికి సిద్ధపడటంచూసి, అతడి ఉదార స్వభావానికి భవానీచరణునికి చాలా ఆశ్చర్యం కల్గింది.

పట్టణంలోని ఇంటిని అత డెన్నడూచూచి వుండలేదు. పైగా అదంటే అతడి కంతగా ఆసక్తి లేదు.

భవానీచరణుడు ఈవిషయాలన్నీ తల్లి వ్రజసుందరికి చెప్పేసరికి ఆమె నెత్తినోరూ బాదుకుంటూ 'అదెలా? అసంభవం! ఆలందీ తాలూకాను ప్రత్యేకంగా నాకు ఇచ్చివేశారు; అందులో ఇతరులకు జోక్యమేమీలేదు. పైగా, దాని ఆదాయం అంతఎక్కువాగాదు. పిత్రార్జితంలో నీవాటా నీకెందుకు దక్కదు? 'అంటూ తన దురదృష్టాన్ని నిందించుకోసాగింది.

'అది మినహా నాన్నగారు మనకు ఏమీ ఇవ్వలేదనే తారాపదు డంటున్నాడు' అని అన్నాడు భవానీచరణ్.

'ఆ మాటలన్నీ నా కెందుకు? వాటితో నాకేమీ పని లేదు. మీ నాన్నగారు వ్రాసిన వీలునామాకు రెండు నకళ్ళున్నాయి. అందులో ఒకటి నావద్దనే ఇనప్పెట్టెలో వుంది' అని చెప్పింది వ్రజసుందరి.

పెట్టెను తెరచి చూశారు. కానీ అందులో వీలునామా లేనేలేదు. ఆలందీ తాలూకాను ఆమె పేర వ్రాసిఇచ్చిన దాన పత్రం మాత్రమే వుంది. ఎవరో దొంగిలించినట్లే కన్పిస్తుంది.

సలహాదారుడికి కబురంపారు. గ్రామపురోహితపుత్రుడు బగలాచరణుడు వచ్చాడు. బుద్ధిలో అతని కెవరూ సాటి రారనే అందరూ అనటం. తండ్రి గ్రామంలోని మంత్రదాత యని, కుమారుడు మంత్రణదాత యని ప్రసిద్ధి. తండ్రి కొడుకులు ఇద్దరూ కలిసి గ్రామపు ఇహ పర లోకాలను పంచుకున్నారు. వాటికి ఫలితం ఇతరులవిషయంలో ఎలా

వున్నా, తమకుమాత్రం ఎటువంటి ఇబ్బందులూ జరగటం లేదు.

'వీలునామా మార్గాంతరకపోయినా అభ్యంతరమేమీలేదు. తాత తండ్రుల ఆస్తిలో ఇద్దరుసోదరులకు సమానహక్కులు వుండనే వుంటాయి, ఇందులో అడిగే దేముంది?' అన్నాడు బగలాచరణుడు.

ఇంతలో రెండవపక్షం తరపున వేరొక వీలునామా బయటకొచ్చింది. కానీ, అందులో భవానీచరణుని పేర ఏమీ వ్రాయనే లేదు, ఆస్తిఅంతా మనుమల పేర వ్రాసివుంది. అప్పుడు అభయాచరణునికి సంతానమే లేదు.

బగలాచరణుడ్ని నాయకునిగా నియమించి భవానీచరణుడు దావాసాగరంలో తననావను వదిలిపెట్టాడు. రేవుకు చేరినతర్వాత ఇనప్పెట్టె తెరిచిచూస్తే ఏముంది? లక్ష్మివాహనపుగూడు అక్కడ అంతా శూన్యంగా వుంది; దాని రెండు మూడు బంగారు రెక్కలుమాత్రం వూడిపడున్నాయి. పిత్రార్జితం ఎదిరిపక్షంవారి వశమైపోయింది. ఆరిపోయే దీపంవలె మినుకుమినుకుమంటున్న ఆలంది తాలూకాలోని కొద్దిపాటి భాగంతోనే గుడ్డిమెల్లగా కాలంగడుస్తుంది; అంతవరకేగాని గొప్ప వంశప్రతిష్ఠమాత్రం నిలవదు. తనకు ప్రాప్తించిన పాత యింటినే భవానీచరణుడు మహాఅదృష్టంగా భావించాడు; ఇది వారికి గొప్పవిజయమనే భావించాడు. తారాపదుడు తన కుటుంబంతోసహా పట్నానికి వెళ్ళిపోయాడు. ఆతర్వాత ఈ రెండుకుటుంబాలకు మిగిలివున్న సంబంధమంటూ ఏదీ లేనేలేదు.

# 2

శ్యామాచరణుడు చేసిన ఈ విశ్వాసఘాతుకం వ్రజ సుందరికి శూలంవలె గుచ్చుకుంది. శ్యామాచరణుడు తండ్రి వీలునామాను దొంగిలించి అన్నగారిని ఇంతఏహ్యంగా మోసగించటం, పరలోకంలోవున్న తండ్రికికూడా అపచారం చేశాడు. మాటిమాటికీ దీర్ఘంగా నిట్టూర్చి 'అంతా ఆ భగ వంతుడు చూస్తాడు' అని అంటూవుండేది. 'నాకీ చట్టాలు కోర్టులు ఏమీ తెలియవు. చూస్తూవుండు. ఆవీలునామా ఎప్ప టికైనా నీకు దొరికితీరుతుంది' అని ఎప్పుడూ వ్రజసుందరి భవానీచరణునికి ధైర్యంచెప్తూవుండేది.

తల్లినోటినుంచి ఎప్పుడూ అదేపనిగా ఆశ కల్గించే ఈ విషయాన్ని వినగా వినగా వీలునామా ఎక్కడకూ పోదనీ, ఎప్పుడో ఒకప్పుడు దొరికితీరుతుందనీ భవానీ చరణునికి నమ్మకం ఏర్పడింది. అతడు చేయగల్గిందేమీలేదు. అందువల్ల ఇలువంటి ధైర్యవచనాలు అతనికి చాలా వూరట కల్గించేవి. పతివ్రత స్త్రీ మాట తప్పక జరిగితీరుతుంది. తమ హక్కుకు చెందినది తమకు లభించి తీరుతుందనే దృఢ విశ్వాసాన్ని ఏర్పరచుకున్నాడు. తల్లి మరణానంతరం అతడి విశ్వాసం మరింత బలపడింది. మృత్యువు కల్గించిన విచ్ఛేదం లోనుంచి తల్లియొక్క పవిత్ర తేజస్సు మరింత దేదీప్యంగా అతడి కళ్ళముందు నర్తించసాగింది. ప్రస్తుతంవున్న ఆర్థిక ఇబ్బందులన్నా, కష్టాలన్నా అతని కేమాత్రం లక్ష్యమే లేదు.

ఈ తిండి గుడ్డల ఇబ్బందులు, వెనకటినుంచీ వస్తున్న ఆచారవ్యవహారాలు ఇవన్నీ క్షణభంగురాలు, ఇదంతా మూడురోజుల ముచ్చట. సమయంవస్తే మళ్ళీ అన్నీ యథా ప్రకారమే జరుగుతాయి. అందువల్ల పూర్వపు ఢక్కామల్లు పంచెలన్నీ చినిగిపోయినతర్వాత స్వల్పవెలగల ముతక ధోవతలు కొని ధరించినప్పుడు అతనికి నవ్వొచ్చింది. పూజా మహోత్సవంలోకూడా పూర్వంవలె ఆడంబరమేమీ కన్పించలేదు. 'నమో నమః' అని మాత్రమే ఆచారవిధిని ముగించాల్సి వచ్చింది. అతిథి అభ్యాగతులు దీర్ఘ నిట్టూర్పులు వదులుతూ పూర్వపువిషయాలను ప్రస్తావించారు. భవానీచరణుడు లోలోపలే నవ్వుకున్నాడు. 'ఇదంతావుండేది ఈ నాల్గురోజులే, ఆతర్వాత మళ్లీ పూజలు వీళ్ళందరూ ఆశ్చర్యపోయేంత ఆడంబరంగా జరుగుతాయని వీరికి తెలియదు' అనుకున్నాడు మనస్సులో. భవిష్యత్తులో చేయుటకు నిశ్చయించుకున్న ఆ ఆడంబారాన్ని వూహించుకుంటూవుంటే అతడి దృష్టి ప్రస్తుత బాధలు, ఇబ్బందులపైకి పోయేదేకాదు.

ఈవిషయంలో అతడిమాటల్ని వినే సభికుడు నటవరుడు నౌకరే. ప్రతిసంవత్సరం నౌకరు, యజమాని బీదతనంలో మునిగితేలుతూ కూర్చుని మంచిరోజులు రాగానే పూజామహోత్సవం ఎంత ఆడంబరంగా జరపాలి, ఎవరెవర్ని ఆహ్వానించాలి, ఎవర్ని ఆహ్వానించకూడదు అనే విషయాలన్నీ చర్చిస్తూవుండేవారు. అప్పుడు కలకత్తానుంచి ఏ నాటక సమాజాన్ని పిలిపించాలోకూడా చర్చించేవారు. ఈవిషయం

లో ఇద్దరికీ తీవ్రమైన అభిప్రాయభేదాలు కలిగేవి. అదేపనిగా చర్చించేవారు. స్వభావసిద్ధమైన గుణంతోనే నటవరుడు ఆభవిష్యత్తు కార్యక్రమములో లోభితనం కనపర్చేవాడు. దానిమీాదట భవానీచరణుడు గట్టిగా మందలించటం కూడా జరిగేది. తరుచు ఇలా జరుగుతూవుండేది.

తన ఆస్తిపాస్తుల విషయంలో భవానీచరణుని మనస్సులో ప్రత్యేకమైన విచార మేమీాలేదనే ఇంతకూ చెప్పదలచింది. అతనికున్న ఉద్వేగమల్లా తన ఆస్తిని ఎవరు అనుభవిస్తారు అనేదే. ఇంతవరకూ తనకు సంతానం కలుగలేదు. పెళ్ళి ఈడుకువచ్చిన ఆడపిల్లలు వున్న తండ్రులు అతడి మేలును కోరి వచ్చేవారు. ద్వితీయ వివాహం చేసుకోవలసిందని సలహా నిచ్చేవారు. అతడి మనస్సు అప్పుడు కొద్దిగా చలించేది. నూతనవధువుయందు ప్రత్యేక ఆసక్తి వుండటం దీనికి కారణం కాదు. పైగా కారణం ఏమంటే, సేవకులు, అన్నవస్త్రాలవలెనే అతను స్త్రీనికూడా పూర్వపు పద్ధతుల ననుసరించి ఐశ్వర్యంలో భాగంగా భావించేవాడు. కానీ, ఐశ్వర్యం కల్గు సూచనలు వుండికూడా సంతానం లేకపోయేసరికి, దీని నతను అదృష్టపు అపహాస్యంగా భావించేవాడు.

సరిగ్గా అదేసమయంలో అతనికి కొడుకు కలిగేసరికి, 'ఈ ఇంటికి ఇహ అదృష్టం పట్టుకుంది' అన్నారందరూ. పరలోకగతుడైన పెదబాబు అభయాచరణుడే స్వయంగా ఈ యింట్లో జన్మించాడనీ ఆ కళ్ళు, ముక్కు, ముఖంతీరూ

అన్నీ అంతే నన్నారు. బాలుని జాతకాన్నిబట్టి చూసేసరికి గ్రహ నక్షత్రాల సంయోగం చాలాలాభకరంగా వుండటమే గాక పోయిన ఆస్తి చేతికిరాకుండా వుండనే వుండదు.

కుమారుడు కల్గినతరువాతనే భవానీచరణుని స్వభావంలో కొద్దికొద్దిగా మార్పుకన్పించసాగింది. ఇంతకూ దరిద్రాన్ని ఒకమాయగా భావించి, దానిని చాలా సునాయాసంగా సహిస్తూవచ్చాడు. కానీ, ఇప్పుడు కుమారుని విషయంలో ఆవిధంగా భావించుకుని గడపటం దుర్భరమైపోయింది. శాన్‌వాడీయొక్క సుప్రసిద్ధ చౌధరీసంశంలో, వంశానికి వన్నెతెచ్చి ముక్తినిచ్చేందుకు గ్రహనక్షత్రాల సంపూర్ణసహకారంతో అవతరించిన ఆబాలకునియెడకూడా అతనికి కొంతబాధ్యత వుంది. నేటివరకు పరంపరాగతంగా ఈ కుటుంబంలో పుత్రసంతానానికి జన్మించినప్పటినుంచీ జరుగుతూవచ్చే మర్యాదమన్ననను భవానీచరణుని జ్యేష్ఠపుత్రుడు మొదలే పొందలేకపోతున్నాడనే ఆవేదనను అతడు మర్చిపోలేకపోతున్నాడు. వంశపారంపర్యంగా లభిస్తూవచ్చిన సుఖాలను తనబిడ్డ పొందలేకపోవటంలో తనఅపరాధ మెంతవుందో తలపోస్తూ, 'నేనే ఇతడ్ని మోసగించాను' అనుకోసాగాడు. అందువల్ల డబ్బుఖర్చుపెట్టి తాను బిడ్డకొరకు చేయగల్గినదానిని, అధికగారాబం చూపిస్తూ పూర్తిచేయాలని యత్నించసాగాడు.

కాని భవానీచరణుని భార్య రాసమణి అదోరకమైన స్త్రీ. చౌధరీవంశపు ఔన్నత్యాన్ని గురించిన విచారం,

ఉద్వేగం, దుఃఖంగానీ ఆమె మనస్సులో లేనేలేవు. ఈ విషయం భవానీచరణునికీ తెలుసు. అదిచూసి అతడు తనలో తానే నవ్వుకునేవాడు. 'సాధారణకుటుంబంలో జన్మించిన రాసమణిని క్షమించవచ్చు, చౌధరీవంశ మాన మర్యాదలను గురించి పూర్తిగా తెలుసుకోవట మనేది ఆమెశక్తికి మించిన పని' అని అతడు యోచించేవాడు.

ఈవిషయాన్ని రాసమణే అంగీకరించేది. 'నేను పేద యింటిపిల్లను. మన్నన మర్యాదలతో మా కేమి అవసరం? నాకు కావల్సిందల్లా కాలీచరణుడు చిరంజీవిగా వర్ధిల్లాలనేదే. నాకు వున్న సర్వమూ వాడే' అనేది. పోయిన వీలునామా దొరుకుతుందనీ, కాలీచరణుని ద్వారా లుప్తమైపోయిన వంశసంపదయొక్క బీటలువారిననదిలో మళ్లీ ప్రవాహం ముంచుకొస్తుందనీ, మొదలుగాగల ఈవిషయాలన్నీ ఆమె ఒకచెవితో విని మరొకచెవితో వదిలేసేది. ఇహ అటు భర్తస్థితి ఏమంటే, అతడు పోయినవీలునామానుగురించి సంభాషించని వ్యక్తి ఒక్కడూ మిగలలే దా గ్రామంలో. ఒక్క తనభార్యతోమాత్రమే ఈవిషయాన్ని చర్చించలేదు. ఒకటి రెండు పర్యాయాలు ప్రయత్నించి చూశాడు. కానీ అంత ఆసక్తి కనపరచకపోవటంతో నిరాశతో, ఆ ప్రసక్తినే వదులుకున్నాడు. అతీతమైన మహిమ, భవిష్యత్తులోని సంపద అనే ఈరెండింటివిషయంలో రాసమణిమనస్సు చాలా విముఖంగా వుండేది. ప్రస్తుత అవసరాల విచారాలన్నీ ఆమెమనస్సును చుట్టుముట్టి వుండటమే ఇందుకుకారణం.

ప్రస్తుత అవసరాలు ఏమంత తక్కువగా ఏమీ లేవు. అతికష్టంగా కుటుంబాన్ని గడుపుకు రావలసి వస్తుంది. లక్ష్మీదేవి వెళ్ళటం చాలా సునాయాసంగానే వెళ్తుంది, కానీ ఆమె వదలివెళ్ళే భారాన్ని వాహకులు ఎంత తంటాలు పడినా మోయలేనంతగా వుండిపోతుంది. అప్పుడిహ ఉపాయ మేమీ వుండదు. అపాయం చాలా వుండిపోతుంది. ఈ కుటుంబానికి మూలమేదో విరిగేపోయింది, కానీ ఆశ్రయించు కునివున్నవాళ్ళుమాత్రం ఎవరూ వదలిపోలేదు. పైగా భవానీచరణుడు ఇబ్బందిగావున్న భయంతో ఎవర్నీ సాగ నంపే మనిషీ కాడు.

ఈ విపరీతభారంతో వంగి శిథిలమైపోయిన కుటుం బాన్ని దిద్దవలసిన భారమంతా ఒక రాసమణిదే. ఎవరివల్లా ఆమెకు చెప్పుకోతగినంత సహాయమేమీ లభించదు. అందుకు కారణం, ఈ కుటుంబపరిస్థితులు బాగున్నరోజులలో తరచుగా ఆశ్రితులందరూ తిని హాయిగా, ఆనందంగా కాలం గడుపు కున్నవారే. చౌధరి వంశపు ఈ మహావృక్షంక్రింద వారి సుఖ పాన్పులపై నీడ దానంతటదే కాస్తూ వుండేది. ఏవిషయం లోనూ, ఎవరికీ ఏవిధమైన విచారమూ వుండేదికాదు. కానీ, ఇవాళ వారిని ఏద్రైనా పనిచేయమని అడిగేటట్లయితే సరి అదెంతో అవమానంగా భావించేవారు. కొద్దిగా వంటింటి పొగ తగిలితే చాలు వారికి తలనొప్పి వచ్చేస్తుంది. కొద్దిగా అటు ఇటు నడిస్తే చాలు శరీరమంతా కీళ్ళనొప్పులు ప్రారంభ మవుతాయి. అప్పుడిహ ఆయుర్వేదపు అతి విలువైన తైలం

కూడా ఆనొప్పులనేమీ తగ్గించలేదు. అదీగాక మరోకారణం వుంది. భవానీచరణుడు చెప్పేదేమంటే 'ఆశ్రయం ఇచ్చి నప్పుడు ఆశ్రితులద్వారా పనిచేయించుకోవటం పాలేరుతనం కంటె హీనమైందనీ, దానివలన ఆశ్రయమిచ్చిన ఫలితమే వుండదు, అందులో గొప్పతనమే వుండదు. చౌధరివంశంలో ఇంతవరకూ అలా ఎన్నడూ జరగనేలేదు.'

అందుకు కారణంగా, ఇహ చేయవలసిందంతా రాస మణే చెయ్యాలి, బాధ్యతంతా ఆమెమీదే వుంది. రాత్రిం బవళ్ళు రకరకాల నేర్పులతో, ఈ కుటుంబపు అవసరా లన్ని టినీ మెదలకుండా గొప్పంగా నెరవేర్చుకుంటూ వస్తుంది. మరి ఈవిధంగా రాత్రింబవళ్ళు దారిద్ర్యంతో తలపడి అతి ప్రయాసతో పోరాడి, తనకు, ఇతరులకు గడుపుకువచ్చే మనిషి సహజంగానే చాలా కఠినుడౌతాడు; అతనిలోని కోమ లత్వం పూర్తిగా నశించిపోతుంది. పైగా మీదుమిక్కిలి వచ్చేబాధ ఏమంటే తాను ఎవరికోసమైతే అడుగడుగునా బాధలు సహిస్తూవుంటుందో వాళ్ళే తనను సహించలేరు. వంటింట్లోకూర్చుని వంటపనిచూస్తేనే రాసమణిపని నెరవే రదు; పైగా, ఉప్పు, పప్పు, నెయ్యి వగైరాలన్నీ సమకూర్చు కునే బాధ్యతలన్నీ ఆమెవే. ఇంతచేసినా వచ్చే దేమిటంటే, ఆ అన్నంతో తృప్తిపొంది ప్రతిరోజూ మధ్యాహ్నం నిశ్చిం తగా, హాయిగా నిద్రపోయే ఆశ్రితులు, ఆ అన్నాన్నీ, అన్న దాతను కూడా నిందిస్తూవుంటారు.

ఒక్క గృహకృత్యాలతోనే రాసమణి పనులు ముగి సేవికావు, రైతులకు ఇచ్చి పుచ్చుకోవటం, మిగిలివున్న కొద్ది గొప్ప పొలాల, ఆస్తుల లెక్కలు చూసుకోవటం వగైరా పనులన్నీకూడా ఆమే చూడాల్సి వచ్చేది. ఇచ్చి పుచ్చుకునే విషయాల్లో ఇప్పుడున్నంత కట్టుదిట్టం వుండేది కాదు పూర్వం. కారణం, భవానీచరణుని డబ్బు అభిమన్యుని సామెతకు పూర్తిగా విరుద్ధమైనది, అతని డబ్బుకు వెడలి పోవటమే తెలుసుగాని, జొరబడే విద్యలో ఏమాత్రం ప్రవేశం లేదు. ఎప్పుడైనా ఎవరైనా డబ్బు అడగటమనేది అతడి స్వభావంలోనే లేనివిషయం. కానీ, ఇచ్చి పుచ్చుకునే విషయాల్లో రాసమణి మాత్రం చాల కచ్చితంగా వుంటుంది. ఆమెవద్ద ఒక దమ్మిడీకూడా తేడా వుండేది గాదు. అందును గురించి రైతులు తమలో తాము ఆమెను నిందిస్తూవుండే వారు, గుమాస్తాలుకూడా యజమానురాలిజాగ్రత్తను చూసి, ఆమె పితృవంశపునైచ్యమే ఇందుకు కారణంగాచూపి ఇష్టం వచ్చినట్లు వ్యాఖ్యానించేవారు. పరాయివాళ్ళు పరాయి వాళ్లే, అప్పుడప్పుడు ఆమె భర్తసైతం ఈవిధమైన లోభి తనము, కర్కశత్వము జగత్ప్రసిద్ధమైన తమ వంశానికే అమర్యాదాకరమని కొద్దీ గొప్ప కోపం కనబరుస్తూవుండే వాడు. అయినా, ఈ కోపతాపాలను, నిందారోపణలను ఏ మాత్రం లక్ష్యపెట్టక రాసమణి తన నియమానుసారంగా తన పనులు చేసుకుంటూ వుండేది, దోషాలన్నీ తనపైనే

వేసుకునేది. 'నేను పేదకుటుంబంలో పుట్టిపెరిగాను, ధని కుల నడవడులు నాకేమీ తెలియవు' అని మాటి మాటికీ అంగీకరిస్తూ, ఇంటా బయటా అంతటా అందరికీ అయిష్టమై, కొంగును నడుముకు బిగించి తుఫానువేగంతో తన పనులన్నీ చేసుకుంటూ వుండేది. ఆమెఎదుటకువచ్చి ఆటంకపర్చ టానికిగానీ, ఏదైనా చెప్పటానికిగానీ ఎవరూ సాహసించే వారు కారు.

భర్తను ఏపనికోసమూ పిలిపించి ఏమీ చెప్పేదే కాదు. పైగా ఆయన ఏపనిలోనైనా చెయ్యిచేసుకుంటాడనే ఆమె లోలోపల ఎప్పుడూ భయపడుతూ వుండేది.'మీ రేమీ విచా రించవలసిన అవసరంలేదు. అన్నీ నేను సంబాళించుకుంటాను' అనిచెప్పి భర్తను ఏపనీ చేయనిచ్చేది గాదు. భర్తకూడా జన్మించినదాదిగా దీనికేఅలవాటుపడివున్నాడు, కనుక కనీసం ఈవిషయాల్లోనైనా భార్యకు అంతకష్టంకలిగేది కాదు. రాస మణికి చాలా వయస్సువచ్చేవరకు సంతానం కలగలేదు. అందువలన అకర్మణ్యసరళస్వభావము, పరముఖాపేక్ష గల తనభర్తవల్లనే దాంపత్యప్రేమ, మాతృస్నేహము రెండూ నెరవేరుతూ వుండేవి. భవానీచరణుడ్ని ఆమెవయస్సొచ్చిన బాలునిగానే భావించేది. అందువల్లనే అత్తగారు కాలంచేసిన తరువాత రాసమణే గృహయజమానురాలు, గృహిణి ఇద్దరి పనీ చూసుకోవలసివచ్చింది. గురుపుత్రులనుంచి, తదితరుల నుంచి, ఇతరబాధలనుంచి భర్తను కాపాడుటకుగాను ఆమె చాలా కఠినంగా వ్యవహరించేది. అదిచూసి భవానీచరణుని

మిత్రులుసైతం ఆమెముందు భయపడేవారు. తన తీవ్రతను కొద్దిగా తగ్గించుకొని స్త్రీ సహజమైన సిగ్గు వినయాల నభిన యించటానికిగాని, సూటిగా మాట్లాడే మాటల్ని కొంచెం తగ్గించుకోటానికో, లేక పురుషజాతిముందు వదిగి వదిగి తిరగ టానికో ఆమెకు అవకాశమే వుండేదిగాదు.

ఇంతవరకు భవానీచరణుడు భార్యచెప్పినట్లే నడుచు కుంటున్నాడు. కానీ, ఇప్పుడిహ కుమారుడు కాలీచరణుని విషయంలో భార్యచెప్పినట్లు నడుచుకోవడం అతడికి చాలా కష్టమనిపించింది. దానికి కారణం, రాసమణి భవానీ చరణుని పుత్రుడిని భవానీచరణుని దృష్టితో చూచేది కాదు. 'పాపం, చెయ్యాలన్నా ఆయ నేం చేస్తాడు, ఆయనదోషంమాత్రం ఏముంది, ఆయన కలిగిన కుటుం బంలో జన్మించాడు, మరోఉపాయంమాత్రం ఏముంది' అనుకునేది ఆమె భర్తనుగురించి. కనుక తనభర్త ఏ రకం గానూ బాధపడాలని ఆమె ఆశించేది కాదు. అందువల్లనే ఆమె వేల లోపా లున్నాభర్తకు అలవాటయిన అవసరాలను తీర్చటానికి ఆమె శక్తివంచనలేకుండా ప్రయత్నించడంలో ఏమాత్రం అశ్రద్ధ చేసేది కాదు. వారింట్లో, ఇతరుల విష యంలో చాలా కట్టుదిట్టంగానూ, కఠినంగానూ వున్నప్పటికీ భవానీచరణుని ఆహార వ్యవహారాల్లో పూర్వపు నియమాల్లో ఏమీ భేదం రాలేదు.

ఒకవేళ ఎప్పుడైనా ఏవిషయంలోనైనా అంతఇబ్బంది కలిగి, అంతలోపమేదైనా జరిగినా, రాసమణి దానిని భర్త

దృష్టికి రానిచ్చేది కాదు. 'ఈ పాడుకుక్క ఎక్కడ దాపురించిందో కాని, ఎంగిలిచేసి అంతా పాడుచేసేసింది' అనేది అంత అత్యవసరసమయాల్లో. ఈమాట అని తన కల్పిత అజాగ్రత్తకు తననే నిందించుకుంటూ వుండేది. ధోవతి అవసరమై అది లేకపోయేసరికి పనికిమాలిన నటవర్‌పై విరుచుకుపడేది. 'నిన్న కొత్తధోవతి తెప్పించానో లేదో ఈగాడిద పారేశాడు' అనేది. అప్పుడప్పుడు భవానీచరణుడు తన ప్రియమైన నౌకరుపక్షం వహించి వాదించేవాడు, రాసమణి అసలు ధోవతే కొనలేదు, భవానీచరణుడు దానిని చూసిందీలేదు. అయినా ఏ కల్పితధోవతినిగురించి తన నౌకరు అపరాధి అయ్యాడో, ఆవిషయాన్ని భవానీచరణుడు ఒకపర్యాయం 'నటవరుడు ఆధోవతిని తనకే ఇచ్చా' డని తేలిగ్గా అంగీకరించాడు. కానీ, ఆతర్వాత ఏమయిందో వూహించలేకపోయాడు. ఇహ అప్పుడు దానిని రాసమణే పూర్తిచేసింది. 'మీరు దానిని బైట కచేరీలో వదలివేసివుంటారు. ఎవరిష్టం వచ్చినట్లు వాళ్ళు వస్తూపోతూవుంటారు, ఎవరో ఎత్తుకపోయి వుంటారు' అంది.

భవానీచరణుని విషయంలో ఇటువంటి ఏర్పాట్లు వున్నాయి; కానీ, కొడుకునుమాత్రం ఆమె భర్తతో సమానంగా చూచేదే కాదు. అతడు తనకడుపునపుట్టినబిడ్డ, అతనికి ఈ ధనికతత్వం ఎందుకు! అతడు దృఢకాయుడూ, సమర్థుడూ కావాలి. అతడు కష్టాలను సునాయాసంగా ఎదుర్కొంటాడు, కష్టపడి పొట్టగడుపుకుంటాడు. 'ఇది కావాలి' 'అది కావాలి'

అనటం వాడికి అంత శోభించదు. కాళీచరణుని అన్నవస్త్రాల ఏర్పాట్లన్నీ అతిసాధారణమైనవే. అటుకులు, మరమరాలు, బెల్లం ఇవే అతడికి ఫలహారంగా లభించేవి. చలికాచుకుంటానికి ఒక మామూలుదుప్పటి. బడిపంతులుగారిని పిలిపించి- 'కుర్రవాని చదువువిషయంలో ఏమాత్రం చనువు ఇవ్వవద్దనీ, ప్రత్యేకశ్రద్ధవహించి చెప్పాలనీ, కఠినంగా శిక్షించవచ్చుననీ, అలా అయితేనే చదువుకొని తెలివిగలవాడవుతాడనీ ఆమే స్వయంగా చెప్పింది.

అదే వచ్చినచిక్కు. సాధుస్వభావంగల భవానీచరణునిలో అప్పుడప్పుడూ విద్రోహలక్షణాలు గోచరించేవి. అయినా రాసమణి వాటిని గమనించనట్లే ప్రవర్తించేది. భవానీచరణుడు ప్రబలమైన పక్షంముందు ఎప్పుడూ ఓటమిని అంగీకరిస్తూనేవస్తున్నాడు. ఈపర్యాయంకూడా ఓటమిని అంగీకరించాడు; కానీ మనస్సులోమాత్రం దానిని వ్యతిరేకించడం మానలేదు. ఈ యింట్లోజన్మించినబిడ్డ దుప్పటికప్పుకోవటం, మరమరాలు అటుకులు ఫలహారం చేయడం ఇంతకు పూర్వం ఎన్నడూ కనీ వినీ ఎరుగని ఈ విషయాన్ని రోజు రోజూ చూస్తూ ఎలా సహిస్తాడు?

దుర్గపూజామహోత్సవాలనాటి విషయం అతడి కింకా గుర్తుంది. తమ తాత తండ్రులకాలంలో విలువైన మంచి మంచి దుస్తులు ధరించి ఎంత ఉత్సాహంగా తాము ఉత్సవాలకు వెళ్ళేవారు! మరి ఇవాళ, రాసమణి కాళీచరణుని కోసం కొనే చౌకబారు దుస్తుల్ని చూస్తుంటే, ఆరోజుల్లో

అటువంటి వాటిని తమయింటి నౌకర్లుకూడా స్వీకరించేవారు కారు. 'కాళీచరణునికి ఇచ్చేవానితోనే అతడు సంతృప్తి పొందుతున్నాడు. అతనికి పూర్వాపువిషయాలేవీ తెలియవు. అతడు సంతోషంగానేవున్నాడు, అనవసరంగా మీరు బాధ పడటం ఎందుకు?' అని రాసమణి అనేకపర్యాయాలు భర్తకు నచ్చజెప్పయత్నించింది. పాపం, కాళీచరణునికి తన వంశ గౌరవ ప్రతిష్ఠలు తెలియవు, అందుకనే అతణ్ణి మోసగించటం జరుగుతుందనే విషయాన్ని ఎంతప్రయత్నించినా భవానీ చరణుడు మర్చిపోలేకపోతున్నాడు. ఏదైనా చిన్న కానుక లభిస్తేచాలు గర్వంగా, సంతోషంతో గంతులువేసుకుంటూ తండ్రికి చూపించాలని పరిగెత్తుకుంటూ వస్తాడు. అప్పుడే భవానీచరణుని హృదయం మరీ బాధపడేది. అత డా దృశ్యాన్ని చూడలేకపోయేవాడు. ఆయన ముఖం తిప్పుకుని అక్కడినుంచి లేచి వెళ్ళిపోయేవాడు.

భవానీచరణుని వ్యాజ్యంనడిపిన తర్వాతనుంచీ అతడి గురువుగారివద్ద హెచ్చువేసినట్లు ధనం పెరిగిపోతుంది. అయి నప్పటికీ, అంతటితో సంతృప్తిచెందక, ఇటు కొన్ని సంవత్స రాలుగా పూజా మహోత్సవాల సందర్భాల్లో గురుపుత్రుడు బగలాచరణుడు కలకత్తానుంచి రకరకాల విదేశీఆటబొమ్మల్ని తెచ్చి దుకాణం తెరిచేవాడు. వాటినిచూచి గ్రామంలోని పిల్లలు, పెద్దలుకూడా చలించేవారు. పైగా, కలకత్తాలోని గొప్పగొప్పవారే వీటిని కొంటారని విని, గ్రామస్తులు, తమ

పల్లెటూరితనాన్ని పోగొట్టుకునేందుకు శక్తికిమించిన డబ్బు వెచ్చించి వాటిని కొనేవారు.

ఒకపర్యాయం బగలాచరణుడు చాలా విచిత్రమైన దొరసానిబొమ్మను తీసుకొచ్చాడు. దానికి కొంచెం కీ యిస్తే చాలు, దొరసాని బల్లమీదినుంచి లేచి, గాలి విసురుకుంటూ అటూ ఇటూ తిరిగేది. గాలి విసురుకునే ఈ దొరసాని బొమ్మనుచూసి కాళీచరణుడు చాలా ఆశపడ్డాడు, దానిని పొందాలని చాలా వ్యాకులపడ్డాడు. తల్లి స్వభావం అతనికి పూర్తిగా తెలుసు. అందుకని తల్లితో మాటమాత్రమైనా చెప్పకుండా తిన్నగా భవానీచరణుని దగ్గరకు వెళ్ళాడు, తన మనస్సులోనిమాటను తండ్రితో చెప్పాడు. భవానీచరణుడు వెంటనే ప్రేమగా, దయచూపిస్తూ, బొమ్మ తెచ్చిస్తానని ధైర్యం చెప్పాడు కాని, ధర వినేసరికి అతడిముఖం వాడి పోయింది.

డబ్బు, దస్కం వసూలు చేసేదంతా రాసమణే; డబ్బంతా ఆమెవద్దే వుంటుంది. భవానీచరణుడు భిక్షుకునివలె తన అన్నపూర్ణద్వారంముందుకు వెళ్ళాడు. ముందు ఎన్నో అనవసర విషయాలు ప్రస్తావించాడు, తర్వాత వెంటనే తన మనస్సులోని విషయం వెలిబుచ్చాడు. 'మీా బుర్ర చెడిందా ఏమిటి!' అంది రాసమణి అతిక్లిష్టంగా.

భవానీచరణుడు కాస్సేపటివరకు ఆలోచిస్తూ కూర్చు న్నాడు. 'సరే చూడు, నువ్వు అన్నంతోపాటు నాకు నెయ్యి

పాయసం వడ్డిస్తున్నావుగదా, అ వేమంత అవసర?' అన్నాడు అకస్మాత్తుగా.

'అవసర మెందుకు కాదు' అంది రాసమణి.

'దానివలన పిత్తం పెరుగుతుందని డాక్టరుగా రన్నారు' అన్నాడు భవానీచరణుడు.

రాసమణి గట్టిగా తలూపుతూ 'మీ వైద్యునికి అన్నీ తెలుసు' అంది.

'నేను చెప్పేదేమంటే రాత్రిపూట పూరీలుమానేసి, అన్నమేపెట్టు, అదే మంచిది. పూరీలవల్ల పొట్ట బరువెక్కుతుంది' అని అన్నాడు భవానీచరణుడు.

'పొట్టబరువెక్కడంవల్ల ఇవ్వాల్టివరకూ మీకేమీ నష్టంకలుగలేదుగా. పూర్వంనుంచీ రాత్రులందు మంచి పుష్టిగల ఆహారమే తీసుకుంటున్నారు' అంది రాసమణి.

భవానీచరణుడు అన్నివిధాలా త్యాగంచేయటానికి సిద్ధపడ్డాడు. అయినా భార్య బలవంతంవల్ల మెదలకుండా వుండాల్సివొచ్చింది. రోజురోజుకూ నెయ్యిధర విపరీతంగా పెరిగిపోతుంది, కాని, పూరీలసంఖ్యలో ఏమీ లోటురాలేదు. మధ్యాహ్న భోజనసమయానికి పాయసం ఎలాగో వుంటుంది, పెరుగులేకపోయినా పనిజరుగుతుంది. కాని, ఈవంశపు పెద్దలు విడువకుండా పాయసం, పెరుగు తింటూ వచ్చారు గనుక దానిలో ఏమీ మార్పురాలేదు. ఎప్పుడైనా భవానీచరణుని భోజనంలో కొంచెం పెరుగు తగ్గితేచాలు-రాసమణి ఆలోచా

నికే చాలా నొచ్చుకునేది. ఈ కారణాలన్నింటివలన, గాలి విసురుకునే ఆ దొరసానిబొమ్మ భవానీచరణుని నెయ్యి, పెరుగు, పాయసం వీటిల్లో దేనిద్వారానూ ఆయింట్లో ప్రవేశించలేకపోయింది.

ఏదో మామూలుగా తిరుగుతూ తిరుగుతూ వచ్చినట్లుగా ఒకనాడు భవానీచరణుడు తనగురుపుత్రుని ఇంటికి వెళ్ళాడు. అవీ, ఇవీ అనేక అనవసర అప్రస్తుత విషయాలన్నీ మాట్లాడుకున్న తరువాత అతడు ఆ బొమ్మవిషయం అడిగాడు. ప్రస్తుత తన ఆర్థికస్థితి బగలాచరణునికి తెలియనిది కాదు, అయినా ప్రస్తుతం డబ్బులేనందువలన కుమారుని కొరకు మామూలు ఆటబొమ్మను కూడా కొనలేకుండా వున్నానే అనే అభిమానంతో క్రుంగిపోసాగాడు. చివరకు అభిమానాన్ని చంపుకుని దుప్పటిలోనుంచి వస్త్రంలో చుట్టి వున్న విలువైన కాశ్మీరుశాలువాను బైటకుతీసి దుఃఖం ముంచుకురాగా రుద్ధకంఠంతో 'సమయం అలాంటిది, చేతిలో డబ్బు అంతగా లేదు, అందుకని శాలువాను నీవద్ద తాకట్టుగా వుంచి అబ్బాయికి బొమ్మ కొందా మనుకున్నాను' అని చెప్పాడు.

శాలువాకంటే కొంచెం తక్కువఖరీదుదైనా ఒక వస్తువే అయివుంటే బగలాచరణుడు సందేహించేవాడుకాదు. దీనిని జీర్ణించుకోవటం కష్టమని అతనికి తెలుసు. గ్రామస్థులు ఎలాగో నిందిస్తారు. అంతేగాక రాసమణి నోటినుంచి వచ్చే మాటలు అంతసరసంగా వుండవు. అందుకారణంగా జరిగిన

పర్యవసాన మేమంటే ఖాలువాను చంకలో దాచుకొని భవానీచరణుడు నిరాశతో వచ్చినదారినే తిరిగివెళ్ళాడు.

'నాన్నగారూ, దొరసాని బొమ్మసంగతి ఏమయింది?' అని కాలీచరణుడు రోజూ అడుగుతూ వుండేవాడు. 'ఆగు ఇప్పుడే ఎందుకు? పూజామహోత్సవం దగ్గరకురానీ' అని భవానీచరణుడు నవ్వుతూ జవాబు చెప్పేవాడు.

కాని, ప్రతిరోజూ ఆవిధంగా చిరునవ్వు తెచ్చిపెట్టు కుని బిడ్డను ఊరడించడం భవానీచరణునికి దుస్సాధ్యమై పోయింది. ఇవాళ చవితి, ఇహ సప్తమి మూడురోజులే వుంది. భవానీచరణుడు ఏదో ఒకవంకతో సమయంగాని సమయాన అంతఃపురంలోకి వెళ్ళాడు. ప్రసంగ మధ్యలో హఠాత్తుగా 'చూడు, చాలా రోజులుగా చూస్తూవున్నాను, ఈ మధ్య నుంచి కాలీచరణుడి ఆరోగ్యం రోజురోజుకు మరీ పాడై పోతుంది' అని అన్నాడు.

'భగవంతుని దయవల్ల అలా జరగకూడదు. అయి నా వాడి ఆరోగ్యానికేం ? నేను రోజూచూస్తూనే వున్నాను. సరిగ్గానే వున్నాడే!' అంది రాసమణి.

'నువ్వుచూడలేదా, దిగులుపడి కూర్చునివుంటాడు, ఏమి ఆలోచిస్తూ వుంటాడో ఏమోమరి!' అన్నాడతడు.

'ఒక్కక్షణం అలా కూర్చునివుంటే ఇహలేనిదేముంది. అయినా వాడికి విచారమేముంటుంది. ఎక్కడ ఏకొంటెపని చెయ్యాలా అనే ఆలోచిస్తూవుంటాడు' అని అంది రాసమణి.

ఈవిధంగాకూడా కోటగోడలో ఎక్కడా బలహీన ప్రదేశం కన్పించలేదు; రాతిమీద గుండుదెబ్బకూడా తగల

లేదు. దీర్ఘంగా నిట్టూరుస్తూ తల సవరించుకుంటూ భవానీ చరణుడు బైటకు వచ్చేశాడు. తర్వాత ఒంటరిగానే అరుగు మీద కూర్చుని గట్టిగా రెండుదమ్ములు పొగ పీల్చాడు.

పంచమినాడు అతడి పళ్ళెంలోని పాయసం, పెరుగు అలానే వుండిపోయాయి. రాత్రికి ఒక్క సందేశా మాత్రమే తిని లేచాడు, పూరీలు ముట్టుకోనేలేదు. 'ఆకలి ఏమాత్రం లేదు' అని అన్నాడు.

ఈపర్యాయంమాత్రం కోటగోడలో పెద్ద రంధ్రం పడినట్లే కన్పించింది. షష్టినాడు రాసమణి కాలీచరణుడ్ని చాటుగాపిల్చి, ముద్దుపేరుతో 'మంటూ, నువ్విహా నిలబడటం నేర్చుకున్నావు. నాయనా! ప్రతిదానికోసమూ అలామంకిపట్టు పట్టగూడదు, అది చాలా చెడ్డది. లభించని వస్తువుకోసం ఆశించటం, సగం దొంగతనంవంటిదే, తెలుసా?' అంది.

'నాకేమితెలుసు, నాన్నగారు తెచ్చిస్తామనిచెప్పారు' అన్నాడు కాలీచరణుడు గొణుగుతూ.

దానిమీాదట 'నాన్నగారు అన్నదానికి' అర్థమేమిటో బోధచెయ్యసాగింది. నాన్నగారు అన్నమాటలో ఎంతప్రేమ, వాత్సల్యం, వేదనవుందో, ఆయన దానిని తెచ్చిచ్చినందువల్ల ఆ పేదసంసారానికి ఎంత నష్టమో, కష్టమో తెలియజెప్ప సాగింది. రాసమణి ఇవాళ్టివరకూ ఏవిషయాన్నీ కాలీచరణునికి ఈవిధంగా నచ్చజెప్పలేదు. ఆమె చేసే దేదైనాసరే, అతి సంక్షిప్తంగానూ, తనశక్తిననుసరించే చేసేది. ఒక ఆదేశాన్ని చల్లబర్చాల్సిన అవసరం కలుగలేదెన్నడూ ఆమెకు. అందు

వల్ల ఆమె ఇవాళ ఇంత వినయంగా, ఇంత విపులంగా తెలియ జెప్పటం కాలీచరణునికి చాలా ఆశ్చర్యం కల్గించింది; తల్లి హృదయంలో తనకోసంవున్న ఆ బాధను, చిన్నవాడైనప్పటికీ అతడు అర్థంచేసుకున్నాడు. కానీ, దొరసానియందు అతనిలో పాతుకునివున్న ఆపేక్షను తొలగించుకోవటం ఎంత కష్టమో తెలివిగలవారికి చెప్పాల్సిన అవసరంలేదనుకుంటాను. కాలీచరణుడు బుంగమూతిపెట్టి, ఒక కర్రముక్క తీసుకుని నేల త్రవ్వసాగాడు.

అప్పుడిహమళ్ళీ రాసమణికి ఆగ్రహంకల్గింది. దానితో కఠినంగా 'నీకు కోపంరానీ, ఏడ్చుకో, మొత్తుకో, ఏమన్నా చేసుకో, అందనివస్తువేదో ఎంతమాత్రం అందనే అందదు' అని అంది. వ్యర్థంగా ఇహ సమయాన్ని వృధాచెయ్యకుండా ఆమె గబగబ వెళ్ళిపోయింది.

కాలీచరణుడు బైటకు వెళ్ళాడు. భవానీచరణుడు అప్పుడు ఒంటరిగానే కూర్చుని పొగ త్రాగుతున్నాడు; కొడుకును చూడగానే ఏదో అత్యవసరకార్యంపై ఎక్కడికో వెళ్తున్నట్లుగా గబగబ లేచి నిలబడి వెళ్ళిపోసాగాడు. కాలీచరణుడు పరుగెత్తుకుంటూ వచ్చి 'నాన్నగారూ! నా దొరసాని—' అని చెప్పబోయాడు.

ఇవాళ భవానీచరణునిముఖంలో నవ్వు కన్పించలేదు. కాలీచరణుణ్ని ప్రేమగా దగ్గరకుతీసుకుని 'నాయనా, కాస్సేపాగు, ఒక అవసరమైనపనిమీద వెళ్తున్నాను. అది ముగించుకుని వచ్చినతరువాత మాట్లాడదాం, సరేనా!' అన్నాడు.

ఈమాట అని ఆయన త్వరత్వరగా బయటకు వెళ్ళి పోయాడు. తన తండ్రిగారు వెళ్తూవెళ్తూ దుప్పటితో కన్నీరు తుడుచుకున్నట్లు కనిపించిం దతనికి.

పొరుగింటిముందు పరీక్షార్థం సన్నాయి వాయిస్తు న్నారు. శరత్కాలపు లేయెండ ఉదయమే కరుణాస్వరంలో వినిపించే సన్నాయిస్వరంలో దాగిన కన్నీటిభారంతో వ్యధ చెందుతున్నట్లుగా వుంది. కాలీచరణుడు తనయింటిముంగిట నిలబడి బజారువంకే చూస్తున్నాడు. తన తండ్రి ఏపని నిమిత్తమూ, ఎక్కడికీ వెళ్ళటం లేదని ఆయన నడకనుబట్టే అర్థమవుతుంది. అడుగడుక్కు విపరీతమైన నైరాశ్యభావాన్ని మోస్తున్నట్లు, కాస్సేపు ఆ బరువును దించుకుని విశ్రమించ టానికే ఎక్కడా జాగా లభించనట్లుగా వుంది ఆయన నడక.

కాలీచరణుడు లోనికివెళ్ళి 'అమ్మా, నాకు గాలి విసురునునే ఆ దొరసాని బొమ్మ వద్దు' అని చెప్పాడు తల్లితో.

అప్పుడు రాసమణి కత్తెరతో గబగబపోకచెక్కలు కత్తిరిస్తూవుంది. ఆమెముఖం ఈమాటవిని వికసించింది. తల్లి కుమారులకు అక్కడ ఏమేమి సంభాషణ జరిగిందో ఎవరికీ తెలియదు. కత్తెరను, పోకచెక్కల్ని ఎక్కడి వక్కడే వదలి వేసి అప్పటికప్పుడు రాసమణి బగలాచరణుడి ఇంటికి బయలు దేరింది.

ఇవాళ భవానీచరణుడు చాలా ఆలస్యంగా ఇటింకి తిరిగి వచ్చాడు. స్నానం ముగించి, భోజనానికికూర్చున్నారు;

ఆయన ముఖంచూస్తే ఇవాళకూడా పాయసానికి, పెరుగుకు ముక్తి లభించినట్లే కన్పిస్తుంది. ఇహ ఆ చేపపులుసంతా పెంపుడుపిల్లికే దక్కవచ్చు.

ఇంతలో కాగితంలో కట్టబడివున్న ఒక పొట్లాం చేత బట్టుకుని రాసమణి రానే వచ్చింది. వచ్చీరావటం భర్త ఎదుట కూర్చుంది. భవానీచరణుడు భోజనంచేసి విశ్రాంతి తీసుకునే సమయమందే ఈ రహస్యం చెప్పాలని ఆమె అనుకుంది; కానీ, పాయసం, పెరుగుల గౌరవం నిలపటానికని ఆమె ఇంత త్వరపడాల్సివచ్చింది. పెట్టెలోనుంచి తీసి బైట పెట్టగానే దొరసానమ్మగారు ఉక్కబోస్తున్నట్లు గబగబ విసురుకోసాగింది. పిల్లి ఇవాళ చాలా నిరాశతోనే తిరిగి పోయింది. 'ఇవాళ పదార్థాలు చాలా బాగున్నాయి. ఇటు వంటిభోజనం చాలా రోజులుగా లభించనే లేదు. పాయసం ఇవాళ అత్యద్భుతంగా వుంది' అన్నాడు భవానీచరణుడు భార్యతో.

సప్తమినాడు కాలీచరణునికి బహుకాలవాంఛ తీరింది. ఆరోజంతా అతడు దొరసాని గాలి విసురుకోవటం చూస్తూనే వున్నాడు. తోటి మిత్రులందరికీ చూపించి వారికి ఈర్ష్య కల్గేట్లుచేశాడు. మరోపరిస్థితిలో అయితే ఈ కర్రదొరసానమ్మ గాలి విసురుకోవడం చూడగా చూడగా విసుగెత్తేదే; కాని అది అష్టమిరోజున తన చేతిలోనుంచి వెళ్ళిపోతుంది. కనుక రోజంతా ఆ ఆకర్షణ అలాగే వుంది. రాసమణి తమ గురు పుత్రునికి రెండు రూపాయల రొఖ్ఖం ఇచ్చి ఆమరబొమ్మను

ఒక్కరోజుకని మాత్రమే తెచ్చింది. అష్టమినాడు కాలీచర ణుడు ఒక నిట్టూర్పు వదలి, పెట్టెతోసహా దొరసానిని బగలాచరణుని చేతుల్లో పెట్టాడు. ఒక్కరోజున లభించిన ఆసంతృప్తి చిహ్నం చాలారోజులవరకు అతడి మనస్సులో మెదులుతూనేవుంది, అతడి వూహాప్రపంచంలో దొరసాని గాలి విసురుకోవటం ఆగటమనేదే లేదు..

అప్పటినుండి కాలీచరణుడు తన తల్లి సలహాతో ఆమెకు మిత్రసమాను డయ్యాడు. భవానీచరణుడుకూడా ప్రతి సంవత్సరం తన కుమారునికి ఇంత తేలికగానే ఇటువంటి విలువైన కానుకల్ని ఎన్నో తేసాగాడు, వాటినిచూస్తే ఆయనకే విస్మయం కలిగేది.

ప్రపంచంలో విలువలేకుండా ఏదీ లభించదు. ఆవిలువ ఎంత బాధతో వస్తుందో అనేది, ఆ తల్లి కుమారునిగా అతడు దానిని అర్థంచేసుకున్నకొద్దీ కాలీచరణుడు అంత రంగికంగా చాలా పెద్దవా డయ్యాడు. అన్నిపనులకూ అతడు తల్లికి కుడిభుజంలాగా నిలిచేవాడు. కుటుంబభారాన్ని దిద్దు కోవాలి, ఆభారాన్ని మరింత పెంచకూడదని ఎవరూ ఉప దేశించకుండానే అతడి నరనరాన జీర్ణించిపోయింది.

తన బాధ్యతల్ని, తన కుటుంబ బాధ్యతల్ని తానే నిర్వహించటానికి సిద్ధపడాలి అనే విషయాన్ని దృష్టిలో వుంచుకుని అతడు మనస్ఫూర్తిగా చదువులోమునిగిపోయాడు. పరీక్షలో నెగ్గేసరికి విద్యార్థి వేతనం లభించ సాగింది. 'ఇంతకంటే ఎక్కువ చదవటం ఇహ అనవసరం. ఇప్పు డిహ

అతడు తన జమీందారీని చూసుకోవాలి' అని యోచించాడు భవానీచరణుడు.

'కలకత్తా వెళ్ళి చదవకుండా నా చదువు ఎలా పూర్తవుతుంది, యోగ్యత పెరిగేదెలా?' అని కాలీచరణుడు తల్లితో చెప్పాడు.

'అది నిజమేనాయనా, నువ్వు కలకత్తా వెళ్ళాల్సిందే' అందితల్లి.

'ఇహ నాకోసం ఏమీ ఖర్చుచేయాల్సిన అవసరం లేదు. ఈవిద్యార్థి వేతనంతోనే పని జరిగిపోతుంది. ఒకళ్ళిద్దరు పిల్లలికి చదువుచెప్పి కొద్దిగా సంపాదించుకుంటే చాలు' అన్నాడు కాలీచరణుడు.

కానీ, భవానీచరణుడ్ని ఒప్పించటానికి చాలా బాధ పడాల్సి వచ్చింది. 'ఇప్పుడంతగా మన జమిందారీని చూడ వల్సిన దేముంది?' అని అంటే, భవానీచరణునికి చాలా బాధ కల్గుతుంది, కనుక రాసమణి ఆవిషయాన్నె ప్రస్తావించ లేదు. 'కాలీచరణుడ్ని యోగ్యుడుగా చెయ్యాల్సిందే' అంది ఆమె! కానీ, ఇన్ని తరాలుగా ఇవాళ్టి వరకూ ఎవరూ ఇల్లువదలి బైటకు పోలేదు, అయినా చౌధరీ వంశంలో జన్మించినవాళ్ళందరూ యోగ్యులే. పరాయిదేశమంటే వారు యమపురిని చూసినంతగా భయపడేవారు. కాలీచరణుని వంటి కుమారుడ్ని కలకత్తా పంపాలనేది ఎవరు అనుకోగలరో అతనికి బోధపడటం లేదు. చివరకు గ్రామంలోని అందరికీ ముఖ్యుడు, గొప్ప తెలివిగలవాడైన బగలాచరణుడు సైతం

రాసమణి అభిప్రాయంతో ఏకీభవించాడు.' కాళీచరణుడు వక్కాణి దొంగిలించిన ఆ వీలునామాను తానే బైటకులాగి తీర తాడు. విధివ్రాతను తప్పించటానికి ఎవరికీ సాధ్యం కాదు. ఈ కారణంవల్ల అతను కలకత్తా వెళ్ళటానికి ఎవరూ ఆటంక పర్చలేదు' అని కూడా అతడు చెప్పాడు.

ఈ మాటవల్ల భవానీచరణునికి కొద్దిగా ధైర్యం కల్గింది. పాతకాగితాలన్నిటినీ పైకితీసి వీలునామా దొంగి లింపబడిన విషయాన్ని గురించి కాళీచరణునితో చర్చించ సాగాడు. ప్రస్తుతం అతడు తల్లికి మంత్రిగా బాగుగా పని చేస్తున్నాడు, కానీ, తండ్రిగారి మంత్రణాలయంలో అతడి కేమీ బలం కన్పించటంలేదు. ఎందుచేతంటే తన కుటుం బంలోని ఈ పూర్వపు అన్యాయాన్ని గురించి అతని మన స్సులో ఉండగా ప్రత్యేకం లేదు. అయినా, అతడు తండ్రి గారు చెప్పేమాటలకు తలూపుతూ వుండేవాడు. సీతను ఉద్ధ రించడానికి వీరవరుడైన శ్రీరామచంద్రుడు లంకపైకి బయ లుదేరినట్లుగానే, కాళీచరణుని కలకత్తా ప్రయాణంకూడా భవానీ చరణునికి చాలా గొప్పవిషయంగా కన్పించసాగింది. ఇది మామూలు పరీక్ష పాసవటానికి చేసే ఏర్పాట్లేగాదు, గృహలక్ష్మిని తిరిగి తీసుకురావటానికి చేసే ఏర్పాట్లవలె వున్నాయి.

కలకత్తా వెళ్ళటానికి ఒకరోజుముందు రాసమణి కాళీ చరణుని మెడలో ఒక రక్షాకవచాన్ని కట్టించి, అతడిచేతిలో అర్ధనూరు రూపాయల నోటుంచి "ఈనోటును నీవద్దర వుం

చుకో. ఏదైనా ఆపద ఇబ్బంది వచ్చినప్పుడు దీనినివాడుకో” అని చెప్పింది. ఇంటి ఖర్చులో చాలా నేర్పుగా, చాలా కష్ట పడి మిగిల్చిన ఈనోటును కాళీచరణుడు, యథార్థమైన, పవిత్రమైన కవచాగా భావించి స్వీకరించాడు. ఈనోటును తాను తల్లి ఆశీర్వాదంగా భావించి, సర్వదా దానిని కాపా డాలనీ, ఎప్పుడూ ఖర్చుచేయకూడదనీ మనస్సులో దృఢంగా సంకల్పించు కున్నాడు.

# 3

ఇప్పుడిహ భవానీచరణుడు వీలునామాను గురించి చెప్పటం చాలావరకు తగ్గిపోయింది. ఇప్పుడతడు ఏదిమాట్లా డినా కాళీచరణుడ్ని గురించే. అతడ్ని గురించి చెప్పటానికే ఇప్పు డతడు గ్రామమంతా తిరిగేది. అతడినుంచి ఉత్తరం రావటం ఆలస్యం— ఇంటింటికి వెళ్ళి చదివి విన్పించేవాడు. కళ్ళజోడు తీసేపనే వుండేది గాదు. ఎన్నడూ, ఏతరంకూడా వంశంలో ఎవరూ కలకత్తా వెళ్ళనే లేదు. అందువల్ల కలకత్తా గౌరవంతో అతని వూహ మరింత వుత్సాహపూరితమ యింది, “మాకాళీచరణుడు కలకత్తాలో చదువుతున్నాడు, కలకత్తాలో వాడికి తెలియని విషయమంటూ లేనేలేదు, హుగ్లీనద్ద గంగానదిపై మరొక వంతెన నిర్మించటం మొద లైన వివిధ విషయాలన్నీ అతనికి స్వగృహంలోని విషయాల వలే సుపరిచితాలు”. ఇదుగో, విన్నావా? గంగానదిపై మరొక వంతెన నిర్మిస్తున్నారట, ఇవాళే కాళీచరణుని నుంచి

ఉత్తరం వచ్చింది. అందులో విషయాలన్నీ వ్రాశాడు" అని ఎదురైనవారందరితో చెప్తూ కళ్ళజోడుతీసి ఒక పర్యాయం శుభ్రంగా తుడిచి నెమ్మదిగా ఉత్తరమంతా చదివి విన్పించే వాడు. "చూశావా, కాలం ఎంత మారిపోయిందో? ఇహ ముందు ఇంకా ఏమేమి జరుగుతాయో ఎవరికి తెలుసు? ఇంతకూ, అపవిత్రపాదాలతో కుక్కలు, పిల్లులు అన్నీ గంగానదిని దాటుతాయి, అంతా కలికాలం, ఈకాలంలో జరగందంటూ ఏముంటుంది" అని ఈవిధంగా గంగానది మహాత్మ్యం విచారించాల్సినస్థితిలో వున్నా. కాలీచరణుడు తెలియజేసిన ఈ కలికాలపు విజయవార్తద్వారా, గ్రామప్రజ లందరూ విషయాలన్నీ తెలుసుకోగలిగారనే ఆనందంలో, కలియుగప్రాణుల ఘోరపతనాన్ని గురించిన విచారాన్ని తేలికగా మర్చిపోయారు. ఎవరు ఎదురైనాసరే తలూపుతూ 'నేను చెప్పానుగా, గంగానది ఇక ఎక్కువకాలం వుండదు' అంటూవుండేవాడు. కానీ, గంగపోయేప్పుడు ఆ వార్తకూడా ముందుగా కాలీచరణుని జాబుద్వారా తెలుస్తుందనే మన స్సులో ఆశించేవాడు.

ఇహ ఇక్కడ కలకత్తాలో కాలీచరణుడు మరొకరి ఇంట్లో వుంటూ ఉదయం సాయంత్రం లెక్కలువ్రాస్తూ, పిల్లలకు చదువు చెప్తూ ఏదోవిధంగా చదువు సాగించుకొస్తు న్నాడు. అత్యంతశ్రమతో అతడు ప్రవేశపరీక్ష పాసయ్యాడు. మళ్ళీ విద్యార్థివేతనం లభించింది. ఈ ఆశ్చర్యకరమైనవిషయ సందర్భంలో భవానీచరణుడు గ్రామానికంతా విందుచేయా

లని ఉబలాటపడ్డాడు. దాదాపుగా నావ తీరానికిచేరుకోనుంది, ఇహ ఆ ఆసరాతో హృదయపూర్వకంగా ఖర్చుపెట్టవచ్చు అని యోచించసాగాడు. కానీ, రాసమణి ఏమీ ఉత్సాహం కనబర్చకపోయేసరికి విందును ప్రస్తుతానికి వాయిదావేయాల్సి వచ్చింది.

కాలీచరణునికి ఈపర్యాయం కాలేజీసమీపంలో ఒక మెస్సులో జాగాదొరికింది. మెస్సుమేనేజరు, క్రిందిఅంతస్తులో నిరుపయోగంగావుంటున్న చిన్నగదిని అతడికిచ్చాడు. కాలీచరణుడు ఆ మేనేజరుపిల్లలకు చదువు చెప్తూ, దానికి బదులు రెండుపూటలు వారింట్లోనే భోజనం చేసేవాడు. ఈ నిత్యాంధకారపుగదిలోనే వుంటూవున్నాడు. ఈ గదిలో వున్న ప్రత్యేకత ఏమంటే, అందులో కాలీచరణునికి భాగస్థులెవరూ లేరు. మరి అందువల్లనే అందులోకి గాలికూడా జొరబడ వీలుండేది కాదు. అయినా చదువుమాత్రం నిర్విఘ్నంగా సాగిపోతుంది. ఏది ఏమైనా ప్రతివస్తువును, సౌకర్యాన్ని కోరగలిగినస్థితిలో లేనప్పుడు కాలీచరణుకు ఇహ ఆవిషయాన్ని గురించి ఆలోచించటమే వ్యర్థం.

ఆమెస్సులో అద్దెలుచెల్లించివుండేవారు, ముఖ్యంగా రెండవ అంతస్థులోని ఉన్నతలోకంలో వుండేవారితో కాలీచరణునికి సంబంధమే వుండేదికాదు. కానీ, సంబంధంలేనంత మాత్రాన, ఆ సమూహంనుంచి బ్రతికిపోయే నియమమూ ఏమీలేదు. పైనుంచిపడే పిడుగుపాటు క్రింద ఎంత విధ్వంసం

చేస్తుందో, ఆ విషయాన్ని కాళీచరణుడు త్వరలోనే తెలుసుకున్నాడు.

మెస్సులోని ఉన్నతలోకంలో ఇంద్రాసనాన్ని ఆక్రమించుకొనివున్న అతడ్నిగురించి కొద్దిగా పరిచయంచేయడం అవసరం. అతడు గొప్పయింటిబిడ్డ. కాలేజీలో చదవటానికి మెస్సులోనే వుండటం అతనికి అనవసరమే, అయినా మెస్సులో వుండటమే అతనికి ఎక్కువ ఇష్టం.

అతడి ఉన్నతకుటుంబం తరఫున స్త్రీ పురుషజాతికి చెందిన కొందరుబంధువుల్ని పిలిపించి కలకత్తాలో అద్దెయిల్లు తీసుకొని వుండవలసిందిగా చెప్పారు. కాని, అందుకు అతడెంతమాత్ర మంగీకరించలేదు. ఇంట్లో స్వజనులమధ్య వుండటంవల్ల చదువు జొత్తుగా సాగదనేకారణం చూపించాడతడు. కానీ, అసలు కారణం అది కానేకాదు. వాస్తవానికి శైలేంద్రునికి మిత్రబృందము, ఆడంబరాలు అంటే మహాయిష్టం. దీనికి విరుద్ధంగా ఇంట్లోవుంటే వచ్చే కష్టమేమంటే, ఎప్పుడూ వారితోనే వుండాల్సినపీడా ఒకటి, పైగా రకరకాల ఆదేశాలు, బాధ్యతలభారం మీదపడతాయి. 'వారితో అలా వుండకూడదు, వీరితో ఇలా వుండకూడదు, అది తప్పు' ఇటువంటిచిక్కుల్లో పడాలి. అందువలన శైలేంద్రునికి అన్నింటికంటే మంచిది, స్వేచ్ఛగావుండే ప్రదేశం మెసు. అక్కడ వుండటానికి చాలామంది వుంటారు. కానీ, తనపై ఏబాధ్యతా లేదు. వస్తారు, పోతూ వుంటారు, నవ్వుతారు, బడాయిలు

కొడ్తారు. నదీ ప్రవాహంవలె ప్రవహిస్తూనేవుంటారు, ఎక్కడా ఏమీ ఛిద్రమే చేయరు.

తాను సహృదయుడను, మంచివాడనని శైలేంద్రుని అభిప్రాయం. ఈ అభిప్రాయంలో వున్న గొప్పవిశేషమంటే తానుగా దీనిని స్థిరపర్చుకుంటానికి 'మంచివాడు' గా అవాల్సిన అవసరమేమీ వుండదు. అహంకార మనే పదార్థం ఏనుగులు గుర్రాల్లాంటిది కాదు. దానిని అతితక్కువ ఖర్చుతో మేత ఏమీలేకుండానే బాగా దృఢంగా వుంచవచ్చు.

పైగా శైలేంద్రునికి ఖర్చుచేసేశక్తీ, అలవాటూ రెండూ వున్నాయి. కనుక అతడు తన అహంకారాన్ని ఖర్చు ఏమాత్రంలేని అడవిలోకి మేతకు వదలడు. పైగా దానికి విలువైన మేతవేసి దాని నెప్పుడూ అందంగా అలంకారంగా వుంచుతూ వుంటాడు.

నిజానికి, శైలేంద్రుని మనస్సులో చాలాదయ వుంది. మరి, ఇతరులబాధల్ని తొలగించినప్పుడు అతడి ఆనందానికి అంతే వుండదు. తనశరణు వేడకపోతే అతడు ఆ వ్యక్తిని పూర్తిగా బాధించకా వదిలిపెట్టడు. అతడిదయ నిర్దయగా మారుతుంది. అప్పుడిహ అది భయంకరరూపం దాలుస్తుంది.

మెస్సులోనివారికి సినిమాలు చూపించటం, హోటళ్లలో బాగామేపటం, డబ్బు బదులుగాఇచ్చి మర్చిపోవటం వగైరా గుణాలు అతనిలో బాగా పాతుకపోయి వున్నాయి. క్రొత్తవివాహమైన విద్యార్థి ఎవరయినా పూజాశలవల్లో

ఇంటికి వెళ్ళేముందు మెస్సుఖర్చులు వగైరాలుపోను డబ్బు ఏమీ మిగలకపోయినా, నూత్నవధువుకోసం సబ్బులు, మంచిఅత్తర్లు వాటితోపాటు క్రొత్తఫాషను బ్లౌజులు రెండు మూడు తీసుకువెళ్ళాలంటే ఏమాత్రం ఇబ్బందిపడాల్సిన అవసరం వుండదు. శైలేంద్రుని ఆసక్తియందు విశ్వాసంతో ఆ విద్యార్థి 'నువ్వే మంచిదిచూసి కొనివ్వవోయ్ మిత్రమా!' అనేవాడు. అతనితోపాటు కొట్లోకి వెళ్ళి ఏదో ఒక చౌకబారు వస్తువును ఎన్నుకొనేసరికి శైలేంద్రుడు అతడ్ని మందలించి 'ఛీ, ఛీ, ఇదీ ఒకవస్తువేనా, ఎలా నచ్చింది నీకు' అంటూ చాలా విలువైనది, అందమైన వస్తువును ఎన్నిక చేసేవాడు. పాపువాడు అవునవును, మీకు చాలా బాగా తెలుసు వస్తువునాణ్యం' అనేవాడు. కొనేవాడికి దానిధర వినేసరికి నోటివెంట మాటే వచ్చేది కాదు. అప్పుడిహ నెలచెల్లించాల్సిన ఆ తుచ్ఛమైనభారాన్ని శైలేంద్రుడు తనమీద వేసుకొనేవాడు. ఎదుటివాళ్ళు ఎంతగట్టిగా అభ్యంతర పెట్టినా అదంతా వ్యర్థమే,

ఈవిధంగా శైలేంద్రుడు తానుండేచోట తనచుట్టూ వున్నవారందరికీ అన్ని విషయాల్లోనూ ఆశ్రయదాత అయ్యాడు. జనానికి మేలుచేయాలనే కాంక్ష అతడిలో ఎంత బలంగా పోయిందంటే, ఎవరయినా తన ఆశ్రయాన్ని స్వీకరించకపోతే, ఆ మూర్ఖత్వాన్ని అత డెంతమాత్రం సహించేవాడు కాదు.

పాపం, కాళీచరణుడు క్రిందిచీకటికొట్లో మురికిబట్టిన చాపమీాదకూర్చుని చినిగిన బనీను ధరించి పుస్తకాలపేజీల్లో దృష్టినిలిపి తన్మయత్వంతో పాఠాలను వల్లిస్తూ వుండేవాడు. ఏది ఏమైనాసరే, తాను 'స్కాలర్‌షిప్' పొందాల్సిందే.

కలకత్తావచ్చేముందు తల్లి తనమీాద వట్టేసుకొని, గొప్పయింటిపిల్లలతో తిరిగి ఆనందవినోదాల్లో చిక్కుకో వద్దని చెప్పింది. తల్లి ఆదేశించిం దనే కారణంవల్లనే కాదు, పైగా తాను అంగీకరించవలసివచ్చిన బీదతనంవల్లకూడా అతడు గొప్పయింటిపిల్లలకు దూరంగా వుండాల్సిన అవసరం వుంది. అత డెన్నడూ శైలేంద్రుని ఛాయలకైనా తొంగి చూడలేదు. శైలేంద్రుని స్నేహం సంపాదిస్తే తనకుండే రోజువారీచిక్కు లనేకం చాలా తేలికపడతా యని అతనికి తెలిసినప్పటికీ, ఎంత ఇబ్బంది కల్గినా, ఎన్ని ఆపదలొచ్చినా కాళీచరణుడు శైలేంద్రుని సానుభూతిపొందటాని కెన్నడూ ప్రయత్నించలేదు. తన ఇబ్బందులతోనే, తన బీదతనపు ఏకాంత అంధకారంలో దాగివుండటమే అతడి కెంతోయిష్టం.

కానీ, అతడి యీా పట్టుదల శైలేంద్రుని కేమాత్రం నచ్చలేదు. పైగా ఆహార పానీయాల్లో, దుస్తుల్లో, నిత్య వ్యవహారాల్లో వ్యక్తమయ్యే కాళీచరణునిదరిద్రం శైలేంద్రుని కళ్ళకు మరింత అసహ్యంగా కన్పించేది. మెట్లమీాది నుంచి పైకి వెళ్ళేప్పుడు ఆ చినిగినగుడ్డలు, చుట్టూ దోమతెర వేసిన ఆపక్క శైలేంద్రుని దృష్టిలో పడితేసరి, అది అతడి అపరాధంగానే బాధించేది శైలేంద్రుడ్ని. దానికితోడుగా,

అతనిమెడలో ఒకరక్షరేఖ వుండేది. రెండుపూటలూ తప్పక సంధ్యవార్చుకొనేవాడు. అతడి ఈ విచిత్రమైన పల్లెటూరి తనానికి పైనవుండే సమూహం బిగ్గరగా నవ్వుకునేవారు, చాలా హేళనచేసేవారు శైలేంద్రుని దళంలోని ఇద్దరు విద్యార్థులు ఏకాంతవాసియైన, కోర్కెలులేని యీ బాలుని ఆంతరంగిక రహస్యాన్ని తెలుసుకునేందుకుగాను అతడిగది లోకి రాకపోకలు సాగించారు; 'కానీ, గంభీరప్రకృతి గల కాళీచరణుని నోటితో ఒక్కమాటా చెప్పించలేకపోయారు. ఇహ అటువంటప్పుడు అతనిగదిలో ఎక్కువకాలం కూర్చుం డడం ఆరోగ్యకరమూ కాదు, ఆనందదాయకమూ కాదు, కనుక మరింత త్వరగా లేచి పలాయనం చిత్తగించేవారు.

పాపం, అతడ్ని ఒక్కపర్యాయం తనవిందుకు పిలిచినా కృతార్థుడౌతాడు, అదే ఆలోచించి ఒకనాడు పిలవటం కూడా జరిగింది. కానీ, విందుభోజనాలు తనకు రుచించవనీ, ఆ అలవాటులేదనీ కాళీచరణుడు చెప్పేశాడు. అతడి ఈ తిరస్కృతికి శైలేంద్రుడు తనదళబలసహితంగా అత్యంత ఆగ్రహావేశు డయ్యాడు.

కొద్దిరోజులపాటు పైగదిలోజరిగిన గల్లంతు, ఆట పాటలు, కొంటెపనులమూలంగా కాళీచరణుని చదువు ఎంత మాత్రం సాగలేదు. పగటియందతడు సాధ్యమైనంతవరకు ఏదోచెట్టుక్రింద కూర్చుని చదువుకునేవాడు. రాత్రులందు తెల్లవారుజామునే లేచి చదివేవాడు.

కలకత్తాలోని ఆహార పానీయాలు, సరియైనచోటు లభించకపోవటం, అత్యధికశ్రమ వీటన్నిటికారణంగా కాళీ

చరణునికి తలనొప్పి ఒక జబ్బుగా పరిణమించింది. అప్పు డప్పుడు మూడునాలుగు రోజులవరకు పక్కమీదే పడివుండే వాడు.

ఈ విషయం తెలిస్తే చాలు, తనతండ్రి తనను ఎంత మాత్రం కలకత్తాలో వుండనివ్వడనేవిషయం అతనికి తెలుసు. గాబరాపడి ఆయన కలకత్తా వచ్చాడన్నా ఆశ్చర్యం వుండదు. కాలీచరణుడు గ్రామస్థులవూహా కందనంత సుఖంగా కలకత్తాలో వుంటున్నాడని భవానీచరణుని అభిప్రాయం. పల్లెటూళ్ళ చెట్లుచేమలు వాటంతటవే మొలచినట్లు కలకత్తాలో అన్నివిధాల సౌకర్యాలు వాటంతటవే వస్తాయని, వాటిని అందరూ అనుభవించవచ్చుననే అతని అభిప్రాయం. కాలీచరణుడు తన తండ్రకివున్న ఈ భ్రమను వున్నదానిని వున్నట్లే వుంచేశాడు.

అత్యంత కష్టాల్లో వున్నప్పుడు కూడా అతడు తన తండ్రికి వుత్తరాలు వ్రాస్తూనే వున్నాడు; కానీ, ఇటువంటి కష్టసమయంలో శైలేంద్రుని దళం సరిగ్గా తన నెత్తిమీద భూతాలవలె గందరగోళం, గల్లంతు చేస్తూవుండేసరికి అతనికి చాలా దుఃఖం కలిగేది. ఈవిధంగా దారిద్ర్యపు అవమానాన్ని, దుఃఖాలను అత డెంతఎక్కువగా అనుభవిస్తున్నాడో, తన తలిదండ్రుల్ని ఈ దుఃఖాలనుంచి విముక్తం చేయాలని అత డంత దృఢనిశ్చయానికి వచ్చేవాడు.

కాలీచరణుడు ఎంతగానో ఒదిగి ఒదిగి అందరికీ దూరంగావుండాలని పూర్తిగా యత్నించాడు. అయినా

వారి గల్లంతులోవేమీ మార్పు రాలేదు. ఒకరోజున చూసే సరికి అతడి పాతచెప్పులజతలో ఒక చెప్పు మాయమైంది. దానికిబదులు చాలావిలువైన మరో పాదరక్ష వుందక్కడ. అలా రెండురకాల చెప్పుల్ని వేసుకొని కాలేజీకి వెళ్ళటం అసంభవం. పైగా ఈవిషయాన్ని గురించి ఒకరితో చెప్పుకో వటం కూడా వ్యర్థం. అందుకని పాపం, ఒక మాదిగవద్ద మరొక పాతచెప్పుకొనుక్కొని పని జరుపుకోవలసివచ్చింది.

ఒకరోజున హఠాత్తుగా పైనుంచి ఒకకుర్రవాడు కాలీ చరణునిగదిలోకి వచ్చి 'మీరు పొరబాటున పైనుంచి నా సిగరెట్టుకేసేమైనా తెచ్చారా? ఎక్కడా కన్పించటం లేదు' అని అన్నాడు.

కాలీచరణుడు కోపంగా 'నేను మీ గదిలోనికే రాలేదు' అన్నాడు.

'ఇదిగో, ఇక్కడే వుందిగా!' అంటూ ఆ కుర్రవాడు ముందుకు రెండడుగులువేసి ఆ గదిమూల పడివున్న విలువైన తన సిగరెట్ కేసు తీసుకుని మెదలకుండా వెళ్ళిపోయాడు.

ఎఫ్. ఏ. పరీక్షలో బాగా వ్రాసి స్కాలర్‌షిప్ పొందే ట్లయితే ఈ మెస్సును వదలిపోయి మరెక్కడైనా వుండా లని అతడు మనస్సులో నిశ్చయించుకున్నాడు.

మెస్సులోని పిల్లలందరూ కలిసి ప్రతిసంవత్సరము చాలా ఆడంబరంగా సరస్వతీపూజ చేస్తారు. ముఖ్యంగా దానిఖర్చంతా శైలేంద్రుడే భరించేవాడు. అయినా పిల్లలం

దరూ చందా లిచ్చేవారు. గతసంవత్సరం తెగడికతో కాలీ చరణుడ్ని చందా ఎవరూ అడిగి తీసుకోలేదు. ఈసంవత్సరం అతడ్ని వత్తిడిపెట్టే వుద్దేశ్యంతో చందాలలిస్టు తెచ్చి అతడి ముందుంచారు. ఎవర్నైతే తా నెన్నడూ ఏమాత్రం సహాయం కోరివుండలేదో, తరచు జరిగేవిందుల్లో వినోదాల్లో పాల్గొనే అదృష్టాన్ని తాను తిరస్కరిస్తూవచ్చిన బాలు రం దరూ కాలీచరణునివద్దకు చందానిమిత్తం వచ్చేసరికి ఏమి ఆలోచించాడో ఏమో వెంటనే అయిదురూపాయలనోటు తీసియిచ్చాడు. శైలేంద్రునికి ఈనాటివరకూ తనదళంలోని పిల్లలనుంచి అయిదురూపాయలు లభించనేలేదు. కాలీచరణుని బీదతనానికి, లోభితనానికి ఇవాళ్టివరకూ అందరూ ఈసడి స్తూనేవచ్చారు; కానీ, ఇవాళ అతడు అయిదురూపాయలు చందాయివ్వటం మరింత దుర్భరమైంది. అతడిస్థితి ఏమిటో ఎవరికీ తెలియనిది కాదు; మరి గర్వం ఎందుకో! ఈవిధంగా అతడు అందరిమీదా తన ఆధిపత్యాన్ని సంపాదించా లను కున్నట్లే తోస్తుంది.

సరస్వతీపూజ చాలా ఆడంబరంగా జరిగింది. కాలీచ రణుడు అందుకుగాను అయిదురూపాయలు ఇవ్వకపోయినా అందులో ఏమాత్రం లోపంజరిగేది కాదు. కానీ, కాలీచర ణుని విషయంలో ఆలా చెప్పలేము. ఒకటేమంటే ఆతడు ఒకరింట్లో భోజనంచేస్తున్నాడు. కానీ, అదైనా రోజూ ఒక నిశ్చితసమయానికి లభించదు; రెండోది, వంటవాడు, పని వాళ్ళే అతడి అదృష్టనిర్ణేతలు, అందుకోసమని అందులోని

మంచిచెడుల్ని, ఎక్కువతక్కువలనుగురించిఅసంతృప్తికరమైన విమర్శలేవీ చేయకుండా పలహారాలకోసమని కొద్దిపైకం దగ్గర వుంచుకోవలసే వస్తూవుండేది. అతడియొక్క ఆ కాస్తసంపద ఇవాళ పుష్పనైవేద్యాలతోపాటు సరస్వతీ చరణాలముందు అర్పించబడింది.

కాళీచరణుని తలనొప్పిజబ్బు మరింత హెచ్చిపోయింది. ఈపర్యాయం అతడు పరీక్షల్లో తప్పలేదుగానీ, స్కాలర్‌షిప్ పోయింది. అందుమూలంగా అతడు తనచదువులోని మరికొంత సమయాన్ని తగ్గించుకుని మరొక ట్యూషను చెప్పాల్సివచ్చింది. ఎన్నివిఘ్నాలు, ఉపద్రవా లున్నప్పటికీ, అద్దెలేని ఆ గదినికూడా వదలలేకపోయాడు.

ఈ పర్యాయం శెలవుల అనంతరం కాలీచరణుడు ఈ మెస్సుకురాడనే పై అంతస్తులోని పిల్లలందరూ భావించారు. కానీ, సరిగ్గా సమయానికి ఆగది తలుపులు తెరుచుకున్నాయి. మామూలుధోవతి, అదే పాత చైనాకోటు ధరించి కాలీచరణుడు తనగూటిలో ప్రవేశించాడు. కూలీ నెత్తిమీదనుంచి, మురికి వస్త్రంతో కట్టిన మూటను, డబ్బారేకుపెట్టెను దించుకుని కాస్సేపు బేరమాడి కూలిడబ్బులు ఇచ్చిపంపేశాడు. ఆమూటలో రకరకాల జాడీలు, దొన్నెల్లో, అతని తల్లి రకరకాల రుచిగల పదార్థాలను తయారుచేసి పెట్టిచ్చింది. తాను లేనప్పుడు పైన వుంటున్న పిల్లలు తనగదిలోకి వస్తూవున్నారని కాలీచరణునికి తెలుసు. అతనికి మరేమి జరిగినా లక్ష్యమే లేదు, కానీ, తనతల్లి దండ్రుల స్నేహ నిదర్శనమేదీ వారి

చేతుల్లో పడకూడదనే అతనికోర్కె. తనతల్లి తనకు ఇచ్చిన తినుపదార్థాలన్నీ అతనికి అమృతతుల్యమే. కానీ, వాటిలోని మహాత్మ్యాన్ని గ్రామంలోని పేదప్రజలే అర్థంచేసుకో గలుగుతారు. పట్టణంలోని జిత్తులమారి విద్యార్థులకు ఆ ఘనత ఏమి బోధపడుతుంది? ఆవస్తువులు పెట్టివున్న పాత్రల్లోకూడా పట్టణపు ఐశ్వర్యలక్షణాలేవీ లేవు. కనుక, ఈపట్టణపు పిల్లలు దానిని అవమానిస్తారనేది నిశ్చితమే. అది అతనికి భరించలేనంత దుఃఖాన్ని కల్గిస్తుంది. మొదటిపర్యాయం అతడు ఇటువంటి వస్తువుల్ని బల్లక్రిందవున్న పాతపేపర్లలో దాచాడు. ఈపర్యాయం వాటిని పెట్టెలోపెట్టి తాళంవేయటమే మంచిదనుకున్నాడు. ఇప్పుడిహా అతడు అయిదునిముషాలు బైటవున్నా తలుపు తాళం వేసి వెళ్తున్నాడు.

అతడు చేసే ఈపని అందరికీ బాధగానేవుంది. 'ధన సంపదలు కారిపోతున్నాయి, ఇంటిపరిస్థితి చూసి దొంగకు కూడా దుఃఖమొస్తుంది- దానికి క్షణక్షణానికీ తాళం! దానిని మామిత్రుడు 'బాంక్ ఆఫ్ బెంగాల్' నే చేసేశాడు. ఎవరి మీదా అంత నమ్మకమే లేదు- బాబుగారి చైనా కోటును ఎవరైనా ఆశపడవచ్చు! ఇదుగో రాధా! కనీసం ఇతనికి ఒక క్రొత్త కోటునైనా ఇప్పించాలోయ్! ఎప్పుడూ ఆకోటునే చూసిచూసి మనకు విసుగెత్తుతుంది' అని అన్నాడు శైలేంద్రుడు.

శైలేంద్రుడు ఎప్పుడూ కాలీచరణుని ఆ చీకటికొట్లోకి వెళ్ళలేదు. మెట్లమీదుగా పైకి వెళ్ళేప్పుడు అటుచూస్తేనే

అతని మనస్సు కలతజెందేది. ముఖ్యంగా రాత్రులందు గాలి లేని ఆ గదిలో దీపంముందు నగ్నంగా కూర్చుని కాలేజీ పుస్తకాలు చదవటం చూసినప్పుడు శైలేంద్రునికి వణుకు పుట్టుకొచ్చేది. ఒకనాడు శైలేంద్రుడు తన మిత్రబృందంతో 'ఒకపర్యాయం ఆగది వెదకండోయ్. ఈపర్యాయం అంత ఖజానా ఎక్కడినుంచి తెచ్చాడోఏమో? తాళంవెయ్యకుండా క్షణమైనా వదలివుండటం లేదు' అని అన్నాడు. అందర్నూ ఆపనికి వుత్సాహం కనబర్చారు.

కాలీచరణుని గది తాళం అతిచౌకబారుది. అందు పెద్దపట్టు ఏమీ ఉండదు. ఏతాళంచెవితోనైనా తెరవ వచ్చు. ఒకరోజున కాలీచరణుడు సాయంత్రం ట్యూషను చెప్పటానికి వెళ్ళినప్పుడు, కుతూహలంగల ఇద్దరు ముగ్గురు లాంతరు తీసుకుని గదిలో జొరబడ్డారు. బల్లక్రింద వున్న ఆవకాయ, వూరగాయ వగైరాలన్నీ బైటకు తీశారు; కానీ, ఈవస్తువులు వారి కేమంత విలువైనవిగానూ, గోప్యంగా వుంచదగినవిగానూ కన్పించలేదు.

వెతగ్గా వెతగ్గా తలగడాక్రింద రింగుతోవున్న ఒక తాళంచెవి కన్పించింది. ఆ తాళంచెవితో ఆడబ్బారేకు పెట్టెను తెరిచారు. దానిలో మాసిన బట్టలు, పుస్తకాలు, కత్తెర, చాకు, కలం వగైరా మామూలువస్తువులే కన్పిం చాయి. పెట్టెను మూసివేసి వెళ్ళిపోవాలని అనుకుంటూ వుండగానే పెట్టె అట్టడుగున రుమాలులో చుట్టివున్న దేదో చేతికి చిక్కింది తెరిచి చూసేసరికి అందులో ఒకపొట్లం

వుంది. పొట్లాం తెరిచిచూస్తే, ఒకటితర్వాత ఒకటిగా ఎన్నో కాగితపు మడతల్లో ఒకయాభైరూపాయలనోటు కన్పించింది.

ఆ నోటును చూసేసరికి ఎవ్వరికీ నవ్వాగలేదు. అందరూ బిగ్గరగా పకపకా నవ్వేశారు. ఈనోటునుగురించే అతడు మాటిమాటికి తాళం వేస్తున్నాడని, అత డెవర్నీ నమ్మలేకుండా వున్నాడనీ అర్థమయింది. ఈకుర్రవాని లోభితనానికీ, సందేహస్వభావానికీ చాలా ఆశ్చర్యం కల్గింది శైలేంద్రునికి.

ఇంతలో రోడ్డుమీద కాలీచరణుడు దగ్గినట్లు విన్పించింది. వెంటనే అందరూ పెట్టెమూసివేసి పైకి పరుగెత్తారు. ఒకరు వెనకవుండి త్వరత్వరగా తలుపులు మూసి యథాప్రకారం తాళంవేశారు.

శైలేంద్రుడు ఆనోటునుచూసి బిగ్గరగా నవ్వేశాడు. యాభైరూపాయలంటే శైలేంద్రుని దృష్టిలో లెక్కేలేదు. కాలీచరణునివద్ద ఇంతడబ్బు వుందని ఎవరూ వూహించలేకపోయారు. ఇంత జాగ్రత్తగా వుండగానే, దొంగతనం జరిగితే అతడు ఏమిచేస్తాడో అని అందరూ కుతూహలంతో ఎదురు చూస్తున్నారు.

పిల్లలకు చదువుచెప్పి బాగా అలసిపోయి ఇంటికి చేరిన తరువాత ఏదీచూసుకునే శక్తికూడా లేకపోయింది. ముఖ్యంగా తలనొప్పితో మరీచికాకుగావుంది. ఈనొప్పి ఇంకా కొద్దిరోజులిలాగే వుంటుం దనుకుంటున్నాడు.

రెండవరోజు ఉదయం దుస్తులు తీసుకునేందుకు బల్ల క్రిందనుంచి పెట్టెలాగేసరికి తెరిచివుంది. తనంత అజాగ్రత్తగా వుండకపోయినప్పటికీ తాళంవేయటం మర్చిపోయివుంటా ననుకున్నాడు. కారణమేమంటే, ఒకవేళ దొంగే వచ్చివుంటే గదితాళంవేసివుండేది కాదు.

పెట్టెతెరచి చూసేసరికి వస్తువులన్నీ చిందరవందరగా వున్నాయి. హఠాత్తుగా అతడిహృదయం భయంతో కంపించింది. గబగబా ఆరుమూలు తీసిచూసేసరికి తల్లిఇచ్చిననోటు మాయమైంది. కాళీచరణుడు గుడ్డలన్నీ దులిపిచూశాడు, అంతా గాలించాడు, అయినా నోటు దొరకలేదు. అటు పైవాళ్ళు క్షణక్షణానికీ క్రిందికి దిగివచ్చి, మళ్ళీ పైకివెళ్తూ గదికేసిచూస్తూ వెళుతున్నారు. ఇహ కాళీచరణునిదురవస్థను గురించి అదేపనిగా వర్ణించి చెప్పి శైలేంద్రునిబృందం అతడ్ని ఆనందపరుస్తున్నారు. పైనుంచి అట్టహాసాలు విన్పిస్తున్నాయి.

ఇహ నోటుదొరికే ఆశ పోయేసరికి, తలనొప్పి బాధతో ఆవస్తువుల్ని సర్దుకోవటంకూడా అసంభవమయింది. వెళ్ళి శవంవలె పక్కమీద బోర్లాపడ్డాడు. అతనితల్లి ఎన్ని కష్టాలుపడి, జీవితంలోని ఒక్కొక్క క్షణాన్ని కఠినయంత్రంలో నూరినూరి ఏవిధంగా ఈడబ్బును కూడబెట్టిందో ఆ పరమాత్మునికే తెలుసు. ఒకప్పుడు తనకుకూడా తనతల్లి దుఃఖగాథ తెలియదు. అప్పుడు తానుకూడా తల్లిమీద మరింతభారాన్నే వేసేవాడు; చివరకు ఏరోజునైతే తల్లి తనరోజువారీ దుఃఖా

వర్తనములో తనను సహాయకునిగా చేసుకున్నప్పుడు కల్గినంత గౌరవాన్ని అతడేనాడూ గ్రహించలేదు. కాళీచరణుడు తన జీవితంలో అన్నిటికంటే గొప్పసందేశాన్ని, అన్నిటికంటే మించిన శుభాశీర్వాదాన్ని పొందాలంటే అది ఈనోటుతోనే పూర్తయింది. అగాధమైన మాతృస్నేహసాగరమథనంతో లభించిన అమూల్యమైన దుఃఖకానుక, దొంగిలించబడిం దివాళ. పైవాళ్ళు అనవసరంగా ఎక్కటం, దిగటం ఆగేట్లే లేదు. గ్రామానికి నిప్పంటుకుని, సర్వమూ దగ్ధమైపోతూ వుంటే, ప్రక్కనుంచే కలకలధ్వనితో ప్రవహిస్తూపోయే నది వలె వుం దీవిషయంకూడా దాదాపు.

పై అంతస్తునుంచి బిగ్గరగా నవ్వటంవిని, ఇది దొంగ పని కాదనిపించింది కాళీచరణునికి. శైలేంద్రునిబృందమే వినోదంకోసం తననోటును ఎత్తుకుపోయి వుంటారని మరు క్షణంలోనే అర్థంచేసుకున్నాడు. ఏ దొంగో ఎత్తుకుపోయి వుంటే అతడి కింత దుఃఖమే కలిగేదికాదు. ధనగర్వంతో మత్తెక్కిన ఈయువకులు తనతల్లిమీద చెయ్యిచేసుకున్నట్లని పించిం దతనికి. ఇంతకాలంనుంచీ తను మెస్సులో వుంటు న్నాడు. ఒక్కనాడైనా ఆ మెట్లమీదుగా పైకివెళ్ళి ఎరు గడు. కానీ, అతడిశరీరం ఇవాళ చినిగిన బనీవుంది, కాళ్ళకు చెప్పులులేవు, మనోఆవేగం, తలనొప్పివలనకల్గిన ఉద్రేకంతో అతడిముఖం జేవురించింది. ఆ స్థితిలోనే గబగబా మెట్లెక్కి పైకివెళ్ళాడు.

ఇవాళ ఆదివారం. కాలేజీకి వెళ్ళాల్సిన పీడాలేదు. బైట వరండాలో కుర్చీమీద' పీటలమీద, బల్లలమీద అక్కడక్కడా అందరూ కబుర్లు చెప్పుకుంటూ, బడాయిలు చెప్పుకుంటూ, నవ్వులు పరిహాసాలతో కూర్చునివున్నారు. కాలీచరణుడు రొప్పుతూ రోజుతూ వారి వాధ్యకువెళ్ళి నిల బడి 'ఇవ్వండి, నానోటు ఇచ్చివేయండి' అని కోపంగా, దుఃఖాన్ని దిగమ్రింగుతూ అడిగాడు.

అతడు ప్రార్థనా పూర్వకంగా అడిగివుంటే మంచిఫలి తమే వుండే దనటంలో ఏమీ సందేహంలేదు. కానీ, వున్మ త్తునివలె వున్న అతని ఆకారాన్ని చూసి శైలేంద్రుడు అక స్మాత్తుగా ఉద్రేకపడ్డాడు. తనయింటి నౌకరు గనుక అక్కడ వుండివుంటే వెంటనే ఈ అనాగరికుణ్ణి మెడబట్టి గెంటించి వుండేవాడు. అందు ఏమాత్రం సందేహంలేదు. శైలేంద్రుని భావం గమనించి అందరూ ఒక్కసారిగా లేచి నిలబడ్డారు. 'ఏమిటీ మీరన్నది? ఏమి టానోటు!' అన్నారు గర్జిస్తూ.

'నాపెట్టెలోనుంచి మీరు నోటు తీసుకొచ్చారు' అన్నాడు కాలీచరణుడు.

'పిట్టకొంచెం, కూతఘనం! మమ్మల్ని దొంగల్ని చేస్తు న్నారా?'

కాలీచరణుని చేతిలో అప్పు డేమైనా వుండివుంటే రక్తపాతంచేసి వుండేవాడు. అతడి ముఖాకృతిని, వాలకాన్ని గమనించి ఇద్దరు ముగ్గురు అతడిచేతిని పట్టుకున్నారు. వలభో

చిక్కిన పులివలె గుర్రుపెట్ట సాగాడు; ఈ అన్యాయానికి ప్రతీకారం చేసేందుకు అతనిలో ఏమీశక్తి లేదు; ఏమీ ప్రమాణం కూడా లేదు; అందరూ అతడి సందేహాన్ని వెర్రితనమని తోసేస్తారు. అతనిమీదికి మృత్యుబాణాన్ని వదలిన వాళ్ళు, అతని మూర్ఖత్వాన్ని అసహ్యించుకుంటూ గంతులు వేయసాగారు.

ఆ రాత్రంతా కాలీచరణుడు ఎలాగడిపాడో, ఎవరికీ తెలియదు. శైలేంద్రుడు వందరూపాయల నోటుని తీసి 'వెళ్లు, ఇచ్చిరా. ఆ పల్లెటూరివాడికి' అనిచెప్పాడు.

'భలే భలే, మీరూ మహాగొప్పవారే! ముందుకాస్త ఆ దుడుకును చావనీ, అప్పుడు వ్రాతపూర్వకంగా అందర్నీ క్షమార్పణకోరుకుంటే అప్పుడే ఏదైనా ఆలోచించేది!' అన్నారు శైలేంద్రుని సహచరులు.

యథాసమయానికి అందరూ నిద్రపోటానికి వెళ్ళిపోయారు, అందరూ త్వరగానే నిద్రపోయారు.

ఉదయం దాదాపు కాలీచరణునిమాటే మర్చిపోయారందరూ. పైనుంచి దిగేప్పుడు అతనిగదిలో ఎవరోమాట్లాడటం విన్పించింది ఒకరికి. వకీలునుపిలిచి అతనిసలహాతీసుకుంటున్నాడేమో అనుకున్నాడతడు. తలుపు లోనుంచి గడియవేసివుంది. బైటనుంచి చెవివగ్గివినేసరికి ఆమాటల్లో చట్టానికి సంబంధించిన వేమీ లేవు. అదంతా అసంబద్ధప్రలాపంగా విన్పించింది.

అతడు వెంటనే పైకివెళ్ళి శైలేంద్రునికి తెలియ జేశాడు. శైలేంద్రుడు దిగివచ్చి ద్వారంముందు నిలబడ్డాడు. కాలీచరణుడు ఏమేమివాగేస్తున్నాడో ఏమాత్రం బోధపడటం లేదు. మాటిమాటికీ 'నాన్నా, నాన్నా' అని అరుస్తూ వున్నాడు.

నోటుపోయిన దుఃఖంతో పిచ్చివాడై పోయాడేమో నని శైలేంద్రుడు భయపడ్డాడు. 'కాలీచరణబాబూ!' అని బైటనుంచి రెండుమూడు పర్యాయాలు పిలవటం జరిగింది. కానీ ఏమీ జవాబురాలేదు. మళ్ళీ ప్రలాపిస్తూ వుండటం విన్పించింది. మరొకసారి శైలేంద్రుడు 'కాలీచరణబాబూ, తలుపు తెరవండి. మీనోటుదొరికింది' అని పిలిచి చెప్పాడు.

కానీ, తలుపు తెరుచుకోలేదు సరిగదా ఆప్రలాపన అలాగే విన్పిస్తోంది.

విషయం ఇంతదాకావస్తుందని శైలేంద్రుడు వూహించనే లేదు. తనసహచరులముందు నోరుతెరిచివమీ అనలేదు. కానీ, లోలోపలమాత్రం పశ్చాత్తాపం శూలంవలె గుచ్చు కుంటూనే వుంది. 'తలుపులు విరగ్గొట్టండి' అని అన్నాడు. 'పోలీసులకు కబురుచేసి విరగ్గొట్టడం మంచిది, నిజంగానే పిచ్చివాడైపోయివుంటే ఏమిచేస్తాడో ఏమో! నిన్నటి విషయం చూసేవున్నాముగా!' అన్నారు కొందరు.

'వద్దు, వద్దు, త్వరగా ఎవరైనా వెళ్ళి మనడాక్టర్ని తీసుకురండి' అనిచెప్పాడు శైలేంద్రుడు.

డాక్టరు సమీపమందే వుంటున్నాడు. కాస్సేపట్లో వచ్చేశాడు. తలుపువద్ద చెవి ఆనించి ఆలకించి 'ఇది వాత ప్రకోపంలో వాగుడు' అని చెప్పాడు. తలుపులు విరగ్గొట్టి లోనికి వెళ్ళి చూసేసరికి బల్లమీద పరచివున్న పక్కంతా చెదరిపోయి సగం నేలమీదపడివుంది. కాళీచరణుడు నేల మీద స్పృహ కోల్పోయి పడివున్నాడు. మాటిమాటికి గిల గిల తన్నుకుంటున్నాడు; ఏమేమో వాగేస్తున్నాడు. కళ్ళు తెరిచేవున్నాయి, ఎర్రగా జ్యోతులవలె వున్నాయి; మరు క్షణమే పగిలి రక్తంచిమ్మేట్లుంది ముఖం.

డాక్టరు అతని సమీపంలో కూర్చుని చాలాసేపటి వరకు పరీక్షించాడు. చివరకు శైలేంద్రుడిన్ని ఉద్దేశించి 'ఇక్కడ ఇతడిసంబంధీకు లెవరైనా వున్నారా?' అనిఅడిగాడు.

శైలేంద్రునిముఖం చిన్నబోయింది. 'ఏం, ఎందుకు?' అని అతడు భయపడుతూ అడిగాడు.

'పరిస్థితిచూస్తే అంతబాగాలేదు. తెలియజేయటం మంచిది' అనిచెప్పాడు డాక్టరు గంభీరంగా.

'ఇతనితో మాకు అంతగా పరిచయంలేదు. వీళ్ళవాళ్లు వుండే దెక్కడో మాకేమీ తెలియదు. ప్రయత్నిస్తాను. ప్రస్తుతం వెంటనే చేయవల్సిం దేమిటి?' అని అడిగాడు శైలేంద్రుడు.

'ముందు ఈగదిలోనుంచి బాగా గాలివచ్చే గదిలోకి మార్చాలి. రాత్రింబవళ్ళు ఒకనర్సు దగ్గరవుండే ఏర్పాటు చేయాలి' అన్నాడు డాక్టరు.

శైలేంద్రుడు రోగిని తనగదిలోకి తీసుకొచ్చాడు. గుమికూడటం మంచిదికాదని చెప్పి మిత్రబృందాన్నంతా పంపివేశాడు. శైలేంద్రుడు తానే స్వయంగా కాలీచరణుని నుదురుపై ఐస్ బాగ్ పెట్టసాగాడు.

పైనవుండే పిల్లలు అపహాస్యంచేసి హేళన చేస్తారనే భయంతో కాలీచరణుడు తన తల్లిదండ్రులవిషయం వీరికి తెలియకుండా దాచాడని పైనే చెప్పటం జరిగింది. అతడే స్వయంగా పోస్టాఫీసుకు వెళ్లి తన ఉత్తరాలను వేసివస్తూవుండే, వాడు అతడిఉత్తరాలన్నీ పోస్టాఫీసుచిరునామాకే వస్తూవుండేవి. అందుకోసం అతడు రోజూపోస్టాఫీసుకు వెళ్తూవుండేవాడు.

కాలీచరణుని ఇంటిఅడ్రసును తెలుసుకునేందుకుగాను మరొకపర్యాయం అతడిపెట్టెను తెరవాల్సివచ్చింది. అతని పెట్టెలో రెండు ఉత్తరాల కట్టలు లభించాయి. రెండుకట్టలు చాలాజాగ్రత్తగా దారంతో కట్టబడివున్నాయి. ఒకకట్టలో తల్లివ్రాసిన ఉత్తరా లున్నాయి. రెండవకట్ట తండ్రి వ్రాసినవి. తండ్రిఉత్తరాలే చాలా ఎక్కువగా వున్నాయి. తల్లివ్రాసినవి చాలా తక్కువ.

ఉత్తరాలు తీసుకుని శైలేంద్రుడు తలుపులు మూసి వేశాడు; రోగిమంచంచెంత కూర్చుని చదవనారంభించాడు. ఉత్తరాల్లో అతడి ఇంటి అడ్రసుచూసి శైలేంద్రుడు త్రుళ్ళిపడ్డాడు. శాన్‌వాడీ, చౌధరీభవనం, భవానీచరణచౌధరి!

ఉత్తరాలను అక్కడవుంచేసి కాస్సేపటివరకు అతడు నిశ్శబ్దంగా కాలీచరణునిముఖంలోకిచూస్తూ కూర్చున్నాడు.

కొద్దిరోజులక్రితం తనసహచరులో ఒకలరు కాలీచరణునికీనీకూ చాలా ముఖపోలిక లున్నా యన్నారు. ఆమాటవినటానికి అతని కంతగా రుచించలేదు. మిగిలిన స్నేహితులందరూ ఆ విషయాన్ని గాలిలో ఎగరగొట్టేశారు. ఆమాట నిరాధార మైందిగాదని అతనికి ఇవాళ అర్థమైంది. తనతాతకు ఇద్దరు కుమారులు - శ్యామాచరణుడు, భవానీచరణుడు అనే విషయం అతనికి తెలుసు. ఆ తర్వాత చరిత్రనుగురించి వారింట్లో ఏనాడూ చర్చించటం జరగలేదు. భవానీచరణునికి ఒకకుమారు డున్నట్లుగానీ, అతనిపేరు కాలీచరణు డనిగానీ శైలేంద్రునికి తెలియదు. అయితే ఇతడే కాలీచరణుడు, తన పెదతండ్రి!

నాయనమ్మ జీవించి వున్నంతకాలం భవానీచరణుడ్ని గురించి ఎంతో ప్రేమగా చెప్పేదనే విషయంకూడా అతనికి గుర్తు రాసాగింది. భవానీచరణుని పేరు తలిస్తేనే ఆమె కళ్ళవెంట కన్నీరొచ్చేది. భవానీచరణుడు తనకు మరిదే అయినా వయస్సులో తన కుమారునికంటే చిన్నవాడు. ఆమె అతడ్ని తనబిడ్డవలెనే పెంచి పెద్దచేసింది. ఆ స్తిపాస్తుల విషయంతో అంతా తలక్రిందులైంది. అన్నదమ్ము లందరూ వేరైపోయారు. అప్పటినుంచి భవానీచరణుడి విషయం తెలుసుకోవాలని ఆమె ఎంతో ఆదుర్దాపడేది. 'భవానీచరణుడు అమాయకుడు, చాలామంచివాడనీ, అందుకని మీరు తప్పకుండా అతడ్ని మోసగించేవుంటారు, మామామగారు అతడంటే ప్రాణాలతో సమంగా చూచుకునేవాడు, భవానీకి

అంత అన్యాయం చేసివెళ్ళారంటే నే నెంతమాత్రం నమ్మను' అని ఎప్పుడూ తనకుమారులతో అంటూ వుండేది ఈమాట లవల్ల కొడుకులు చాలా అసంతృప్తి చెందేవారు. ఈ విషయంలో నాయనమ్మపై తనకూ కోపంవచ్చినట్లు శైలేంద్రునికి గుర్తుకొచ్చింది. నాయనమ్మ భవానీచరణుని పక్షాన మాట్లాడుతూ వుండేది. కనుక తనకు భవానీచరణునిమీద కూడా కోపంవస్తూవుండేది. కానీ ఇప్పుడు భవానీచరణుడు ఇంతశోచనీయమైన స్థితిలోవున్నాడనికానీ, ఇంతదారిద్ర్యంతో జీవిస్తున్నాడనికానీ అతనికి తెలియదు. కాలీచరణుని స్థితి చూసి ఆతనికి విషయాలన్నీ అర్థమయాయి; ఇంతవరకు ఎన్ని వేల ఆశలు చూపించినా కాలీచరణుడు తన బృందంలో చేరకపోవటంచూసి ఇప్పు డతనికి చాలా ఘనంగావుంది. విధి వశాత్తు కాలీచరణుడు తమలో చేరివుంటే, తన కెంతో సిగ్గుగా వుండేది.

## 4

శైలేంద్రుని బృందం ఇంతవరకుకూడా విడవకుండా కాలీచరణుడ్ని బాధిస్తూ, అవమానిస్తూనే వచ్చారు. అందు వలన శైలేంద్రుడు తనపెదతండ్రిని ఇప్పు డిహ తనగదిలో వుంచలేకపోయాడు. డాక్టరు సలహా తీసుకుని, అతిజాగ్రత్తగా కాలీచరణుడ్ని ఒకమంచిఇంటికి మార్చాడు.

శైలేంద్రుని ఉత్తరం అందగానే భవానీచరణుడు ఒకమిత్రుడ్ని వెంటబెట్టుకుని వెంటనే కలకత్తాలో వాలాడు. వచ్చేప్పుడు చాలాక్షోభపడి, తాను కూడబెట్టినదంతా భర్త

చేతికిస్తూ 'చూడు, ఏలోపమూ జరగనివ్వవద్దు! మరీ అంత గాబరాగా వుంటే వెంటనే కబురు పంపండి. నేనుకూడా వస్తాను' అని చెప్పింది రాసమణి. చౌధరీ వంశపు కోడలు ఇలా మొదటి సమాచారానికే కలకత్తా వెళ్ళటం అనేది చాలా అసంగతవిషయం. అదిజరగదు కూడా. ఆమె కాళీ మాతముందు చేతులు జోడించి ప్రార్థించింది. మంత్రాచార్యుల్ని పిలిపించి శాంతిపూజలు జరిపించ నారంభించింది.

భవానీచరణునికి కాళీచరణునిస్థితి చూసేసరికి నోటి వెంట మాటరాలేదు. ఇంతవరకూ కాళీచరణునికి పూర్తిగా తెలివిరాలేదు. అతడు తండ్రిని చూసి 'మాష్టరుగారూ' అని పిలిచాడు, దానితో తండ్రి హృదయం బ్రద్దలైపో సాగింది. కాళీచరణుడు మధ్య మధ్య 'నాన్నా, నాన్నా!' అనికూడా పలవరించేవాడు. అప్పు డాయన అతనిచెయ్యి పట్టుకుని 'నేనే బాబూ, నీదగ్గరే వున్నానుగా!' అనేవాడు. కాని కుమారునిలో తండ్రిని గుర్తించే లక్షణాలేవీ కన్పించలేదు.

డాక్టరు వచ్చిచూచి 'మొదటికంటే జ్వరం తగ్గింది. ఇహ కొంచెం కోలుకోవచ్చు' అని చెప్పాడు. కాళీచరణునికి నయంకాదనికూడా భవానీచరణుడు విచారించలేదు. ముఖ్యంగా అతడు జన్మించిన నాటినుండీ, అతడు పెద్దవాడై వంశాన్ని పునరుద్ధరిస్తాడనే అందరూ భావిస్తూ వచ్చారు. ఆవిషయం భవానీచరణుని మనస్సులో చాలా గాఢంగా పాతుకుపోయింది. కాళీచరణునిఅస్తిత్వాన్నెవరూ ఏమీ చేయలేరని భవానీచరణునికి దృఢవిశ్వాసం ఏర్పడింది.

అందువలన డాక్టరు ఎంతబాగుందని చెప్తే, అతడు అంత కంటే చాలాబాగుందని వినగలిగేవాడు. మరి రాసమణికి ఉత్తరం వ్రాసినప్పుడు అందులో సందేహానికి తావేలేదు.

శైలేంద్రుని సద్వ్యవహారం చూసి భవానీచరణునికి చాలా ఆశ్చర్యం కలిగేది. అతడు తనకు అత్యంత సన్నిహితుడు కాదని ఎవ రనగలరు? ముఖ్యంగా కలకత్తాలోని నాగరికుడు, చదువుకున్న కుర్రవాడు తన నెంతో శ్రద్ధాభక్తులతో చూస్తున్నాడే! కలకత్తా పిల్లలస్వభావం ఇలాంటి దేనేమో అని ఆయన ఆలోచించాడు. 'మరి వీళ్ళకే ఇంత మర్యాద మన్నన తెలియకపోతే మరెవరికి తెలుస్తుం దసలు! గ్రామపుకుర్రవాళ్ళలో ఇంత చదువెక్కడ, ఇంత నాగరికత ఎక్కడ - వీరితో ఏమిపోటీ చేస్తారు!' అని తనలోతానే అనుకునేవాడు.

కాలీచరణునిజ్వరం క్రమంగాతగ్గిపోసాగింది; దానితో పాటు క్రమక్రమంగా తెలివి రాసాగింది. తండ్రిని మంచం వద్ద చూసి అతడు త్రుళ్ళిపడ్డాడు. కలకత్తాలో తా నెలా గడుపుకుంటున్నాడో ఇప్పు డాయనకు తెలియకుండావుండదు అని ఆలోచించసాగాడు. తన పల్లెటూరితండ్రి ఈ కలకత్తా కుర్రవాళ్ళతో హేళనచేయబడతాడనే అన్నిటికంటే అతని కెక్కువవిచారంగా వుంది. నలువైపులా పరికించిచూచి ఇది ఏగదో అతని కేమీా బోధపడలేదు. అంతా అతనికి స్వప్నంగా కన్పించసాగింది.

మరి అంత చింతించటానికి అప్పు డతనికి శక్తి లేదు. రోగంవిషయం తెలియగానే తనతండ్రి కలకత్తా వచ్చి వాలా డనీ, తన నా మురికికూపంనుంచి ఇక్కడకు తీసుకొచ్చి వుంటాడనీ తోచింది. ఎలా తీసుకొచ్చారు, డబ్బెక్కడ తెచ్చారు, తరువాత అప్పుతీర్చటానికి ఎంతబాధపడాల్సి వస్తుందో మొదలైనవిషయాలేవీ అతడు ఆలోచించలేక పోయాడు. ఎలాంటిపరిస్థితులలోనైనా తాను జీవించివుండా లనే అతడు ఆలోచించేవిషయం.

భవానీచరణుడు అప్పుడు గదిలో లేడు. శైలేంద్రుడు ఒక ప్లేటుతో పండ్లుతీసుకుని కాలీచరణునివద్దకు వచ్చాడు. కాలీచరణుడు విస్మయంతో అతడిముఖంకేసి చూడసాగాడు. 'ఇందులో ఏదో పరిహాసముంది' అని ఆలోచించసాగాడు. వీళ్ళబారినుంచి తండ్రిని కాపాడే దెలాగా అనే మొట్ట మొదట ఆలోచించింది.

శైలేంద్రుడు ప్లేటును బల్లమీదవుంచి, నమస్క రించాడు. 'నావలన చాలా అపరాధంజరిగింది. క్షమించండి' అని అన్నాడు.

కాలీచరణుడు మరింత ఖంగారుపడ్డాడు. కాని అతడి ముఖాన్నిచూసి ఇందులో కపటమేమీ వుండకపోవచ్చునను కున్నాడు మొట్టమొదట మెస్సులో యావద్వేషంతో వుజ్వలవంతమైన శైలేంద్రుని ముఖం చూసినప్పుడు కాలీచర ణుని అనేకపర్యాయాలు అటే ఆకర్షింపబడింది. కానీ అతడు తన బీదతనపు సిగ్గువలన అతనివద్దకు వెళ్ళలేదు. తన హోదా

కూడా శైలేంద్రునితో సమానంగా వుంటే, మిత్రునిహోదాలో భుజంభుజం కలిపి తిరిగితే అతనికి సంతోషమేకలిగేది. కానీ, ఇద్దరూ ఇంతదగ్గరగా వున్నప్పటికీవారిద్దరిమధ్యావున్న గోడను దాటేఉపాయమేలేదు. శైలేంద్రుడు పైకివెళ్ళేప్పుడు, క్రిందికి దిగేప్పుడు విలువైన అతని శాలునానుంచివచ్చే సువాసనతో కాలీచరణుని చీకటిగది నిండిపోయేది. అప్పుడిహ తన చదువుకూడా మాని, ఏ విచారమూలేని సంతోషంతో నవ్వుతూవుండే ఆయువకుని ముఖంకేసి చూడకుండా వుండలేకపోయేవాడు. ఆ తర్వాత, ఆ శైలేంద్రుని నిర్దయ యౌవనం తనకు ఎంతఘాతుకంగా పరిణమించిందో తెలిసిన విషయమే. ఇవాళ శైలేంద్రుడు ప్లేటుతో పండ్లు తెచ్చి తనమంచంచెంత నిలబడినప్పుడు అతడు దీర్ఘనిశ్వాసంవదిలి మరోకసారి అతడి అందమైన ముఖారవిందాన్ని చూశాడు. క్షమార్పణ విషయం అతని నోటినుంచి రాలేదు, నెమ్మదిగా పండ్లుతీసుకొని తినసాగాడు. ఈవిధంగా తను చెప్పదలచిందేమిటో చెప్పేశాడు.

తన పల్లెటూరితండ్రితో శైలేంద్రునికి బాగా కలిసిపోవడం కాలీచరణుడు ప్రతిరోజూ చాలా ఆశ్చర్యంతో గమనించేవాడు. శైలేంద్రుడు ఆయన్ని తాతా అంటున్నాడు. ఇద్దరూ నవ్వుతూ పరిహాసాలాడుకునేవారు బాగానే. ఇన్ని రోజుల తర్వాత ఈ హాసపరిహాసాలు దక్షిణవాయుతరంగాలతో భవానీచరణుని హృదయంలో యౌవనస్మృతులు మేల్కొన్నాయి. నాయనమ్మ తయారుచేసిన ఆవకాయ, వూరగాయలు తానేవిధంగా దొంగిలించి తిన్నదీ శైలేంద్రు

డివాళ సిగ్గువిడిచి చెప్పేశాడు. శైలేంద్రుడిది అంగీకరించ టంతో కాళీచరణునికి చాలా ఆనందం కలిగింది. అందులో వున్న గౌరవాన్ని గుర్తించగలిగితే అతడు తన తల్లిచేతి పదార్థాలను ప్రపంచానికంతా విందుచేయగలడు. కాళీచర ణునికి ఇవాళ తన రోగశయ్యే వినోదసభగావుంది. అటువంటి మధురక్షణాలు అతడిజీవితంలోనే లేవు. ఇప్పుడిక్కడ తనతల్లి వుంటేనా అనే విషయమే మాటిమాటికీ తలపోయసాగా డతడు. తనతల్లి వుండి వుంటే ప్రసన్నవదనంగల ఈ అంద మైన యువకుణ్ణి ఎంతగానో ప్రేమించివుండేది.

రోగిగదిలో అప్పుడప్పుడు ఒకవిషయం మాత్రం ఆనందప్రవాహంలో ఆటంకం కల్గించేది. కాళీచరణుని మన స్సులో పేదతనపు అభిమానంలాంటిది వుండేది. ఒకప్పుడు తనకుటుంబం ఎంతో ఐశ్వర్యంతో తులతూగింది అని గర్వ పడటాని కతడు సిగ్గుపడేవాడు. 'మేము పేదవాళ్లం' అనే విషయాన్ని ఏదో 'కానీ' అనేదానితో కప్పిపుచ్చటానికి అంగీకరించేవాడు కాదు. భవానీచరణుడుకూడా తన ఐశ్వర్య దినాల్ని గురించి తనగౌరవం పెరుగుతుందని చెప్పేవాడు కాదు. పైగా ఎందుకోసమంటే అది తనకు చాలా సుఖ సమయమనీ, యౌవనపు రోజులనీ చెప్పేవాడు. కానీ ఆ సంభాషణలో అటుతిరిగి ఇటుతిరిగి వీలునామా విషయం రానేవచ్చేది. అప్పుడిహ ఆయన ఆ ఘోర విశ్వాస ఘాత కానికి విరుద్ధంగా చాలా ఉద్రేకపడేవాడు. దీనితో కాళీ చరణుడు మనస్సులో ఎంతో బాధపడేవాడు. ఇది క్షేమం

తనతండ్రి పిచ్చితనమేనని అతనికి తెలుసు. అయినప్పటికీ అతడు, అతడితల్లీకూడా వారిపిచ్చితనాన్ని సంతోషంగా సహించారు. కానీ, శైలేంద్రుని ఎదుట తనతండ్రిలోని ఈ బలహీనత వ్యక్తంకావటం అతడికేమాత్రం నచ్చేదికాదు. ఇది మిథ్రమేనని అతడు తనతండ్రికెన్నో పర్యాయాలు తెలియజేశాడు. కానీ, దానికి విరుద్ధమైన ఫలితమే కలిగేది. ఆయన మరింతగట్టిగా తనమాటను సమర్థించుకునేవాడు. అప్పుడిహ ఆయన్ని ఆపటం కాలీచరణునికి ఎంతో కష్టమైపోయేది.

ఈచర్చ శైలేంద్రునికి ఏమాత్రం నచ్చకపోవటం కూడా కాలీచరణుడు ముఖ్యంగా వ్యాకులపడటానికి కారణం. ఎందాకా పోయేదంటే, శైలేంద్రుడు కూడా వుద్రేకపడి చాలా పట్టుదలతో భవానీచరణుని మాటల్ని ఖండించేవాడు. మరి మిగిలిన విషయాలన్నింట్లో భవానీచరణుడు అందరి అభిప్రాయాల్ని అంగీకరించసిద్ధపడేవాడు. కానీ, ఈ విషయంలోమాత్రం ఎవరిముందుకూడా తన అపజయాన్నంగీకరించేవాడు కాదు. ఆయనతల్లి చదువుకున్నస్త్రీ. ఆమె తనచేతుల్తోనే వీలునామాను, దస్తావేజుల్ని ఇనప్పెట్టెలోదాచింది. అయినా పెట్టె తెరచిచూసినప్పుడు ఒక్క వీలునామాయే మాయమైంది! ఇది దొంగతనం కాక మరేమిటి? కాలీచరణుడు ఆయన్ని శాంతపర్చటానికిగాను 'పైట, కెక్కడికీ పోలేదుగా, మీ ఆస్తిని అనుభవించేవారు కూడా మీ బిడ్డలతో సమానమే. వారూ మీ సోదర

సంతానమే. అంటే ఉన్నదంతా ఇంట్లోనేవుంది. అదీ సంతోషించదగిన విషయమే' అని అంటూవుండేవాడు. శైలేంద్రుడు ఈమాటల్ని భరించలేక పోయేవాడు. లేచి బైటకు వెళ్ళిపోయేవాడు. కాళీచరణుకు లోలోపలే బాధపడుతూ 'శైలేంద్రుడు తనతండ్రిని ధనాశాపరునిగా భావిస్తాడేమో' అని ఆలోచించేవాడు. తనతండ్రి పూర్తిగా సాధువైన మనిషనీ, ఆస్తియందు ఆయన కేమీ మమకారంలేదనీ తాను శైలేంద్రునికి తెలియజెప్పగలిగితే తన మనోభారం తీరిపోవచ్చు.

ఇన్ని రోజుల్లోపల శైలేంద్రుడు కాళీచరణునికి భవానీచరణునికి తననుగురించి తెలియజేసి వుండేవాడే కానీ, ఈ వీలునామా దొంగతనం చర్చ అతణ్ని ఆపేసింది. తనపెద్దలు వీలునామాను దొంగిలించారు అనేవిషయాన్ని అతడే పరిస్థితిల్లోనూ నమ్మటానికి సిద్ధంగాలేడు. కానీ రెండో వంక భవానీచరణునికి పిత్రార్జితపుహక్కు లేకుండా చేయటంలో ఎవరిదో నిర్దయహస్తం తప్పక పడివుంటుందనే విషయాన్నికూడా త్రోసివెయ్యలేకపోతున్నాడు. తర్వాత తర్వాత అతడీ సంభాషణలో తర్కించటమే మానేశాడు.

ఇప్పటికీ ఇంకా సాయంత్రమయేసరికి కాళీచరణుని ఆరోగ్యం సరిలేకపోవటం జరుగుతూనేవుంది. కానీ, అతడు దీనిని రోగంగా భావించేవాడే కాదు. చదువుకోసం అతడి మనస్సు ఉద్విగ్నంచెందేది. ఒకపర్యాయం స్కాలర్‌షిప్ చేతులలోనుంచి జారిపోయింది. ఈసారి అలా జరగనివ్వ

కూడదు. శైలేంద్రుడు చూడకుండా అతడు చదువనారంభిం చాడు. ఈవిషయంలో డాక్టరువద్దని గట్టిగా చెప్పనేచెప్పాడు. కానీ ఆ విషయాన్ని అత డేమీ లక్ష్యపెట్టలేదు.

'నాన్నగారూ, ఇహ మీరు ఇంటికి వెళ్ళండి, అమ్మ ఒక్కతేవుంటుంది, నాకిహరోగం నయమైపోయింది, ఇప్పు డిక మరేమీ విచారంలేదు' అన్నాడు తండ్రితో కాళీచరణుడు.

అవును, మీరువెళ్ళాలంటే మరేఅభ్యంతరమూ లేదు. కొంచెం బలహీనంగా వున్నాడు. అదే బాగయిపోతుంది క్రమంగా. మేము వుండనే వున్నాము'అన్నాడు శైలేంద్రుడు.

'ఆ విషయం నాకూ తెలుసు. కాళీచరణుని విష యంలో విచారించాల్సిన అవసరమే లేదు. నేను వచ్చివుండక పోయినా మీరే చూసేవారు. కానీ మనస్సు ఒప్పుకోదుగా. ముఖ్యంగా మీ నాయనమ్మ ఆజ్ఞ, ఇహా రాక తప్పేదెలా?' అన్నాడు భవానీచరణుడు.

'తాతగారూ! మీరేగా మరీ అంతగారాబంచేసి నాయనమ్మను నెత్తిమీ దెక్కించుకుంది' అన్నాడు శైలేం ద్రుడు నవ్వుతూ.

భవానీచరణుడుకూడా బిగ్గరగా నవ్వాడు. 'మంచిది, మంచిది, ఇంటికి క్రొత్తకోడలు వచ్చినప్పుడు నీ అదుపాజ్ఞలు ఎలా వుంటాయో, ఎంత కఠినంగా వుంటాయో కూడా చూద్దాం' అన్నాడు.

భవానీచరణుడు ఏకాంతరూపంతో రాసమణి సేవలో పెరిగిన జీవి. కలకత్తాలో విశ్రాంతిదాయకమైన అనేకరకాల

వస్తుసముదాయం వున్నప్పటికీ రాసమణి హస్తసేవను మర్చి పోవటం జరగనేలేదు. అందువలన ఇంటికి వెళ్లేందుకు వెంటనే సిద్ధపడ్డాడు.

ఉదయం సామాను కట్టించుకుని వెళ్ళటానికి సిద్ధమవుతూ ఒకపర్యాయం కాళీచరణునివద్దకు వెళ్ళి చూసేసరికి అతడి కళ్ళు జ్యోతుల్లా ఎరుపెక్కాయి. శరీరమంతా నిప్పులా కాలిపోతోంది. క్రితంరోజు అర్ధరాత్రివరకూ 'లాజిక్' చదివాడు. మిగిలినరాత్రంతా అటు ఇటు దొర్లటమే సరిపోయింది. నిద్రే రాలేదు.

ఇప్పటివరకూ కాళీచరణుడు చాలా బలహీనంగానే వున్నాడు. దానిమీదట రెండవపర్యాయం రోగందండెత్తటం చూసి డాక్టరు చాలా చింతించాడు. శైలేంద్రుడ్ని చాటుగా పిల్చి 'ఈ పర్యాయం రోగం చాలా ప్రమాదస్థితిలో పడినట్లే వుంది' అని చెప్పాడు.

'తాతగారూ ! మీకు కష్టంగానేవుంది. రోగికికూడా సరియైన అనుపానం లేదు. కనుక నేను చెప్పేదేమంటే నాయనమ్మనుకూడా ఇక్కడికి పిలిపించండి' అని శైలేంద్రుడు భవానీచరణునితో చెప్పాడు.

శైలేంద్రుడు విషయాన్ని చాలా మార్చి తిరుగుడుగానే చెప్పాడు. అయినప్పటికీ హఠాత్తుగా భవానీచరణుని హృదయం జారిపోయింది. భయసందేహాలతో హృదయం దడ మరింత హెచ్చింది; కాళ్ళు చేతులు కంపించసాగాయి.

'మీ రెలా మంచి దనుకుంటే అలాగే చెయ్యండి' అని చెప్పాడు.

రాసమణికి ఉత్తరం వ్రాశారు. ఆమె వెంటనే బగలా చరణుడ్ని వెంటతీసుకుని కలకత్తాకు బయలుదేరింది.

సాయంత్రం కలకత్తాకు చేరినతరువాత రాసమణి కొద్ది గంటలుమాత్రమే కుమారుడ్ని జీవంతో చూడగల్గింది, ఆతర్వాత అటంతా సమాప్తం చెందింది. వాయువులో వుండి వుండి అతడు తల్లిని పిలుస్తున్నాడు, అతడి ఆ పిలుపు తల్లి హృదయంలో శాశ్వతంగా గుచ్చుకుని వుండిపోయింది.

# 5

అప్పటికి రాత్రి చాలా ప్రొద్దుపోయింది. అంతులేని శోకపుఅలసటతో రాసమణికి కొద్దిక్షణాలుమాత్రం స్పృహ తప్పి నిద్రవచ్చింది. కానీ, భవానీచరణునికిమాత్రం నిద్ర రాలేదు. కాస్సేపటివరకు అటు ఇటు దొర్లుతూవున్నాడు, తర్వాత దీర్ఘంగా నిట్టూర్చి 'ఓ దయామయా, పరాత్పరా!' అంటూ లేచి కూర్చున్నాడు. కాలీచరణుడు గ్రామ పాఠశాలలో చదువుకుచేరేజుల్లో ఆమూలగదిలో చదువుకుంటూ వుండేవాడు. భవానీచరణుడు లేచి కంపితహస్తాలతో దీపం పట్టుకుని శూన్యంగావున్న ఆగదిలోకి వెళ్ళాడు. రాసమణి స్వయంగా అల్లిన పూలమెత్త బల్లమీద పరచివుంది. ఇప్పటికీ దానిమీద సిరామరకలు అలాగే వుండిపోయాయి. మురికిగా వున్న గోడపై బొగ్గుతో గీసిన జామెట్రీ గీతలు కనిపిస్తు

న్నాయి. బల్లమీద ఒకపక్కగా ఇంట్లో కుట్టిన బూడిదరంగు కాపీ పుస్తకంతోపాటు రాయల్‌ రీడర్‌లోని చినిగిపోయిన పేజీలుకొన్ని ఇవాళ్టికీ పడున్నాయి. అయ్యో! అతడి చిన్న తనంలోని చిన్న పాదరక్ష ఒకటి మూల పడిఉంది; దానిని ఇంతవరకూ చూచినా ఎవరూ గమనించివుండరు. అది ఇవాళ చాలా పెద్దదిగా కన్పించింది. ఇవాళ ఆ చిన్నపాదరక్షను తండ్రికి కనపడకుండా తన చాటున దాచుకోగల్గినంత పెద్ద వస్తువేదీ ఈ ప్రపంచంలో లేనేలేదు.

ఒక రేకుపెట్టెమీద దీపాన్నివుంచి భవానీచరణుడు బల్లమీద కూర్చున్నాడు. ఎండిపోయిన నయనాలనుంచి కన్నీరే రాలేదు. కానీ ఆయనహృదయాంలోపల ఏమైందో ఏమోకానీ బాగా ఊపిరిపీల్చుకోవాలంటే శరీరమంతా విరిగిపోయినట్లుంది.

ఆయన తూర్పుదిశ కిటికీని తెరిచి, దాని చువ్వలను పట్టుకుని బైటికేసి చూడసాగాడు.

అంధకారపురాత్రి. కొద్దికొద్దిగా వర్షం పడుతోంది. ఎదురుగా చుట్టూ ప్రహరీలోపల దట్టమైన అరణ్యముంది. అందులో, సరిగ్గా చదువుకునే గదికి ఎదురుగా, కొంచెం మేర కాలీచరణుడు తోట వేయటానికి ప్రయత్నించాడు. ఇప్పటికి కూడా అతని చేత్తోవేసిన జూకామల్లెతీగ వెదురుపొదంతా అల్లుకుని మూడుపూలు ఆరుకాయలుగా వర్ధిల్లుతోంది. దాని మీద ఎన్నో పుష్పాలు వికసించివున్నాయి.

ఇవాళ, బాలుని చేతితో వేసిన ఆ చిన్నతోటను చూసేసరికి భవానీచరణుని ప్రాణం కంఠంవరకు వచ్చి ఆగి పోయింది. ఇహ ఆశించతగిం దేమీలేదు. పూజాశెలవులు వస్తాయి. కానీ ఎవరికోసమైతే ఈ దరిద్రగృహం శూన్యంగా వుంటుందో అత డిహ ఎన్నడూ, ఏశెలవులకూ తిరిగి ఇంటికి రాడు.

'అయ్యో, నాయనా!' అంటూ భవానీచరణుడు అక్కడే నేలమీాద కూర్చొబడ్డాడు. కాలీచరణుడు తన తల్లి దండ్రుల దారిద్ర్యాన్ని తొలగించటానికనే కలకత్తా వెళ్ళాడు. కానీ, హా! హతవిధీ! తన తండ్రిని ఈ ప్రపంచంలో పూర్తిగా దరిద్రుణ్ణి దిక్కులేనివాడిగా చేసిపోయా డతడు.

బైట వర్షం మరింత జోరుగా కురవసాగింది. ఇంతలో అంధకారంలో గడ్డిఆకుల్లో ఎవరిదో పాదధ్వని వినవచ్చింది. భవానీచరణుని హృదయం దడదడలాడింది. ఏమాత్రం ఆశ లేని విషయాన్నే ఆయన ఆశించాడు. కాలీచరణుడు తన తోటను చూడటానికి వస్తున్న ట్లనిపించిం దాయనకు. 'కానీ, వర్షం చాలా జోరుగా పడుతుంది, అతడు తడిసిపోతాడు' అనే అసంభవ ఉద్వేగంతో ఆయనహృదయంలో సంచలనం కలిగేసరికి ఒక క్షణకాలం కిటికీముందు ఎవరో నిలబడినట్లు కన్పించింది. తెల్లని దుప్పటి కప్పుకుని వున్నాడు. ముఖం గుర్తించటానికి కన్పించలేదు. కాని ఆ శరీరం తీరూ అదీ కాలీచరణునివలెనే వుంది.

భవానీచరణుడు వెంటనే లేచినిలబడి 'వచ్చావా, బాబూ!' అంటూ తలుపు తెరవటానికి వెళ్ళాడు, తలుపు తెరుచుకుని ఇంతకుముందు తనకుమారుడు నిల్చుని కనబడిన చోటుకు వెళ్ళాడు; కిటికీకి ఎదురుగా, చూస్తే అక్కడెవరూ లేరు. ఆ వర్షంలోనే ఆయన తోటంతా తిరిగి వచ్చాడు. కానీ ఎవరూ కన్పించలేదు. ఆనిశీథసమయాన గాఢాంధకారంలో నిలబడి రుద్ధకంఠంతో 'నాయనా, కాళీచరణ్!' అని పిలిచాడు.

కానీ, ఎవరూ బదులు పలుకలేదు. ఆయన కేక విని పరుగెత్తుకుంటూ వచ్చిన వ్యక్తి నౌకరు నటవరుడు. అతడాయన్ని నెమ్మదిగా లోనికి తీసుకొచ్చాడు.

రెండవరోజు, నటవరుడు ఆగది శుభ్రంచేయటానికి వెళ్ళినప్పుడు కిటికీకి ఎదురుగా ఒక పొట్లంలాంటిది పడివుంది. అది తీసుకుని అతడు తిన్నగా భవానీచరణునివద్దకు వెళ్లాడు. భవానీచరణుడు దానిని తెరచిచూడగా, అవి పూర్వకాలపు దస్తావేజులు! కళ్ళజోడు ధరించి కొద్దిగా చదివి వెంటనే లేచి పరుగు పరుగు రాసమణి దగ్గరకు వెళ్ళాడు.

'ఏమిటవి?' అంది రాసమణి కాగితాల్ని తీసుకుంటూ.

అదే, ఆ పూర్వపు వీలునామా' అన్నాడు భవానీచరణుడు.

'ఎవరిచ్చారు?' అని అడిగింది రాసమణి.

'నిన్నరాత్రి కాళీచరణుడు వచ్చాడు. అతడే ఇచ్చి వెళ్ళాడు' అన్నాడు. భవానీచరణుడు.

'ఏంజరుగుతుం దిహ ఇప్పుడు?' అనిఅడిగిందిరాసమణి.

'ఇప్పుడు ఇవేమీ అవసరంలేదు' అని భవానీ చరణుడు భార్య చేతిలోనుంచి తీసుకుని ముక్కలుగా చించిపారేశాడు.

గ్రామమంతా ఈవార్త వ్యాప్తి చెందేసరికి బగలా చరణుడు చాలా గర్వంగా తలూపుతూ 'చూశారా, కాళీ చరణుని ద్వారా వీలునామా తిరిగి వస్తుందని నేను మొదటే చెప్పాను' అన్నాడు.

'నిన్నరాత్రి బండిలో ఒక ఎర్రని కుర్రవాడొచ్చాడు. అతడు నాదుకాణానికివచ్చి చౌధరిఇంటిదా రడిగాడు; నేనతనికి మార్గం చూపించాను. అతడిచేతిలో నేను గుడ్డలో చుట్టివున్న ఏదో వస్తువు చూశాను' అని చెప్పాడు రామచరణ మోదీ.

'అశుభం!' అని బగలాచరణుడు అతడి మాటను పూర్తిగా తేల్చేశాడు.

సమాప్తం